Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 12 • 22-3-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





• ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి

## పదవీ గండం సృష్టించే పనిలో చంద్రబాబు!

చంద్రబాబు పుణ్యాన కిరణ్ సర్కారుకు ఊపిరి నిలిచింది. శాసనసభలో వైఎస్.జగన్, కెసిఆర్‌లు కలిసి ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానాన్ని ఓడించడంలో తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు అంత బాహాటంగా వ్యవహరిస్తాడని పరిశీలకులు వూహించలేదు. చివరకు కిరణ్ కుమార్‌రెడ్డికి కూడా ఇదొక ఆశ్చర్యమే. కానీ చంద్రబాబుది జాలి గొలిపే పరిస్థితి. ఆయన అటు వంటి సంకటంలో ఇరుక్కొన్నాడు. కిరణ్‌కుమార్‌రెడ్డి అంటే మొదట నుంచి చంద్రబాబుకు సరిపడదు. చిత్తూరు జిల్లా రాజకీయాలలో ఇద్దరూ ఆగర్భ శత్రువులు. కిరణ్‌ను ముఖ్యమంత్రి పీఠంపై చూడవలసి రావడమే చంద్రబాబుకు ఆపుకోలేని దుఃఖం. కానీ ఇప్పుడు పరిస్థితి వేరు. కిరణ్ సర్కారు కూలిపోతే ఎన్నికలొక్కటే ప్రత్యామ్నాయం. అందుకు తన పార్టీ సిద్ధంగా లేదు. ఒకవేళ అందుకు సిద్ధపడాలనుకొన్నప్పటికీ, వైఎస్.జగన్ పెట్టిన అవిశ్వాసం వల్ల కాంగ్రెస్ ప్రభుత్వం కూలి పోయిందనే వాస్తవం జనంలోకి వెళ్తే ఆ ఘనత జగన్‌కు ఉపయోగపడుతుంది తప్ప తనకు లాభించదు. ప్రభుత్వాన్ని కూలగొట్టడానికి తన బలం వాడుకొని, ఓట్ల దగ్గర జగన్ ప్రయోజనం పొందడం చంద్రబాబే కాదు, ఆ స్థానంలో మరే నేత వున్నా అంగీకరించలేని విషయం. అందువల్లనే ఆయన తన పార్టీ సహకారం కిరణ్‌కు అందించక తప్పలేదు.

అయితే జనంలో కిరణ్ సర్కారు మీద పట్టలేని కోపం వుందన్న మాట నిజం. కరెంట్ ఛార్జీల పెంపకం, కరెంట్ సరఫరాలో భరించలేని కోతలు, దానివల్ల వేలాది పరిశ్రమల మూత, దానివల్ల లక్షలాది మంది కార్మికులు వీధినపడే దుర్గతి, వీటన్నిటి వల్ల పతనమైపోతున్న రాష్ట్ర ఆర్థిక పరిస్థితి వంటివన్నీ జనంలో కాంగ్రెస్ ప్రభుత్వం పట్ల కోపం కాదు, ద్వేషం పెంచుతున్నాయి. ఒక్క రోజు కూడా ఈ ప్రభుత్వం కొనసాగాలని వారు కోరుకోవడం లేదు. ప్రతిపక్ష స్థానంలో వున్న పార్టీ ఈ అవకాశాన్ని వాడుకోలేని దుస్థితి ఏర్పడడం చంద్రబాబు పూర్వ జన్మలో చేసుకొన్న పాప ఫలితం తప్ప వేరు కాదు.

ఇప్పుడు పరిస్థితి ఏమిటి? జనం కాంగ్రెస్‌తో సమానంగా తననూ ద్వేషించే పరిస్థితి తెచ్చుకోవడం చంద్రబాబుకు ఇష్టం లేదు. జనం అభిమానం కోసం మూడు వేల కిలోమీటర్ల దూరం నడుస్తున్నాడాయన. అపర వయస్సులో అది అలివిమాలిన పని అని తెలిసీ ప్రజలకు దగ్గర కావడానికి మరొక మార్గం తోచక నడకను ఎంచుకొన్నాడు. దానివల్ల ఇప్పుడిప్పుడే కొంతలో కొంత తెలుగుదేశం పార్టీ మెరుగు పడుతున్నది. ఈ దశలో మరొకసారి జనం ద్వేషాన్ని కోరి కొని తెచ్చుకోవడం ఆత్మహత్యా సదృశ్యం అవుతుంది. దానికి విరుగుడు – కిరణ్ సర్కారును తానే పడగొట్టడం మాత్రమే. కీలకమైన బడ్జెట్ బిల్లుల్లో, ద్రవ్య సంబంధిత తీర్మానాలలో ప్రభుత్వాన్ని ఓడిస్తే, ముఖ్యమంత్రిగా కిరణ్‌కుమార్‌రెడ్డి రాజీ

కొరవ 14వ పేజీలో

• వైఎస్ భక్తుడికి

## వైఎస్ ఇంట్లో మళ్లీ స్థానం!

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మనుషులను చాలా ప్రేమించే వాడు. తనను నమ్మి దగ్గరకు వచ్చిన వారిని ప్రాణంతో సమానంగా చూసుకోవడం ఆయన జీవన శైలి. అందుకోసం అవసరమైతే తాను ఇబ్బందులు ఎదుర్కోవడానికి కూడా సిద్ధమే. ఆ కారణం వల్లనే వైఎస్ భౌతికంగా లేకపోయినా ఆయన్ను ఆరాధించే వారు మాత్రం రాష్ట్రమంతా కోకొల్లలుగా వున్నారు. వైఎస్ రాజకీయ శైలి అంటే గిట్టనివారు కూడా అంగీకరించే నిజం ఇది. అటువంటి వైఎస్ భక్తులలో మాజీ సిఎల్‌పి మీడియా కార్యదర్శి రవిచంద్ ఒకడు. ఎన్ఎస్‌యుఐ కార్యకర్తగా వుండిన రవిచంద్ ఎట్లో వైఎస్‌కు దగ్గరయ్యాడు. ఆయన ప్రతిపక్షంలో వున్నప్పుడు సిఎల్‌పి ఆఫీసులో పత్రికల వారిని సముదాయించే బాధ్యత తానే నిర్వర్తించేవాడు. వైఎస్ మీద ఈగ వాలకుండా జాగ్రత్త పడేవాడు.

ఆయన అధికారంలోకి వచ్చిన తర్వాత కూడా ఈ బంధం కొనసాగింది. అందరి వలె వైఎస్‌ను అడ్డం పెట్టుకొని కోట్లు కూడేసుకోలేదు రవిచంద్. చిన్నపాటి పైరవీ కూడా చేయలేదు. నిజాయితీగా నిష్కామకర్మ యోగి వలె సేవ చేశాడు. అయితే వైఎస్ మరణం తర్వాత ఏ కారణం వల్లనో రవిచంద్ పట్ల జగన్ కొంత విముఖత భావం ప్రదర్శించాడు. దూరం పెట్టాడు. ఇన్నాళ్లకు వైఎస్.విజయమ్మ రవిచంద్‌ను మళ్లీ పిలిపించి తన ఇంట్లో స్థానం కల్పించారు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ లెజిస్లేచర్ కార్యాలయంలో పత్రికా సంబంధిత వ్యవహారాలను పర్యవేక్షించే బాధ్యత అప్పచెప్పారు. ఆ పనిలో రవిచంద్ ఆరితేరిన నిపుణుడు. దానితోపాటు ఇతర పార్టీల ఆనుపానులు ఎప్పటికప్పుడు పసికట్టి, తన పార్టీ వ్యూహాలను రచించే బాధ్యత కూడా నిర్వహించగల సమర్థుడు. ఆయన వల్ల పార్టీకి ఉపయోగం చాలానే వుంటుంది.

రవిచంద్‌తోపాటుగా, వైఎస్‌కు నీడ వలె వ్యవహరించిన సూరీడును కూడా మళ్లీ వెనక్కు పిలుస్తారా అన్నది వేచి చూడాలి.

# సంక్షోభంలో కేంద్ర సర్కారు!

కేంద్రంలోని యుపిఏ ప్రభుత్వం మరొకసారి సంక్షోభంలో చిక్కుకున్నది. డిఎంకె అధినేత కరుణానిధి యుపిఏకు మద్దతు ఉపసంహరించాలనే నిర్ణయం తీసుకోవడంతో కేంద్ర సర్కారుకు పదవీ గండం దాపురించింది. లోక్‌సభలో కాంగ్రెస్ నేతృత్వంలోని యుపిఏ కూటమికి వున్న ఎమ్పీల సంఖ్య 273 మాత్రమే. మెజార్టీకి కావల్సిన సంఖ్య 274 అన్న విషయం గుర్తు పెట్టుకొంటే, 18 మంది సభ్యులున్న డిఎంకె మద్దతు ఉపసంహరణ ప్రభావం ఏమిటో అర్థమైపోతుంది. డిఎంకె సమస్య – శ్రీలంక తమిళుల సమస్య. అక్కడి ప్రభుత్వం ఎల్‌టిటిఇ తీవ్రవాద అణిచివేత చర్యలను చాలా క్రూరంగా అమలు చేసింది. ఎల్‌టిటిఇ ప్రభాకరన్ మానవత్వమనేదే లేని రాక్షసుడు. తన ఉద్యమం కోసం ఎన్ని లక్షల మంది ప్రాణాలు బలి పెట్టాడో లెక్క లేదు. తమిళులు నివసించే ప్రాంతాలలో పట్టు కోసం ఆయన తమిళ కుటుంబాలకు చెందిన పది, పన్నెండేళ్ల పసి పిల్లలను కూడా బలవంతంగా ఎత్తుకెళ్లి, తుపాకులిచ్చి, పోరాటం చేయించాడు. మరొక ప్రక్క సైన్యం దాడులు ఎదురైనప్పుడల్లా తమిళ మహిళలను తన సైనికులకు మానవ కవచాలుగా ముందు పెట్టేవాడు. సైన్యం తుపాకి తూటా ముందుగా ఆ అమాయక మహిళల గుండెలలోకి దూసుక పోయేది. ఎల్‌టిటిఇని అణిచి వేసే క్రమంలో శ్రీలంక సైన్యం సైతం అటువంటి పైశాచిక పోకడలే అవలంభించింది. చిన్న పెద్ద స్త్రీ పురుష తేడా లేకుండా కన్పించిన వారిని కన్పించినట్లు కాల్చి చంపింది. ప్రభాకరన్ మరణించినా ఆయన వారసత్వం వల్ల భవిష్యత్తులో ప్రమాదం వుంటుందనే ఉద్దేశంతో పన్నెండేళ్ల ఆయన కుమారుడిని కూడా కిరాతకంగా మట్టు పెట్టింది. ఆ పిల్లవాడి శరీరాన్ని తూటాలతో తూట్లు పొడిచే హృదయ విదారక దృశ్యాన్ని ఒక బ్రిటీష్ మీడియా సంస్థ ఫోటో రూపంలో ప్రపంచానికి అందించింది. దాన్ని చూసిన తమిళుల మనస్సులు తల్లడిల్లాయి. శ్రీలంక ప్రభుత్వం మీద తమిళనాడులో తీవ్రస్థాయి క్రోధావేశాలు వెల్లువెత్తుతున్నాయి. ఈ దశలో ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల విభాగం శ్రీలంక యుద్ధ నేరాలపై ఒక తీర్మానం ప్రతిపాదించింది. అమెరికన్ ప్రభుత్వం దాన్ని సమర్థిస్తున్నది. భారత ప్రభుత్వం కూడా ఆ తీర్మానానికి మద్దతు ఇవ్వాలని కరుణానిధి పట్టుబడుతున్నాడు. తమిళుల మనసులు గెల్చుకోవడానికి అదొక దగ్గరి మార్గమని ఆ రాజకీయ భీష్మాచార్యుడి వ్యూహం. అయితే దానివల్ల పొరుగు దేశంతో మన సంబంధాలు దెబ్బతింటాయి. ఒక్క తమిళనాడు కోరిక కోసం యావత్ దేశ ప్రయోజనాలను పణంగా పెట్టే స్థితిలో కేంద్ర సర్కారు లేదు. దానితో ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి మద్దతు ఉపసంహరణ అస్త్రం ప్రయోగించాడు కరుణానిధి.

ఇప్పుడు యుపిఏను కాపాడగల్గింది సమాజ్‌వాదీ పార్టీ నేత ములాయం సింగ్ యాదవ్ మాత్రమే. ఆయన ఇప్పటికే యుపిఏకు బయట నుంచి మద్దతు ఇస్తున్నాడు. దాన్ని కొనసాగిస్తే ఇబ్బంది లేదు. అయితే కేంద్ర మంత్రి బేణి ప్రసాద్ వర్మ ఆయన్ను ఉద్దేశించి చేసిన కొన్ని వ్యాఖ్యలు పరిస్థితిని జఠిలం చేశాయి. ములాయంకు తీవ్రవాదులతో సంబంధాలున్నాయని, యుపిఏకు మద్దతు ఇస్తున్నందుకు లంచం తింటున్నాడని ఆరోపించాడు బేణి ప్రసాద్. ఆయన్ను మంత్రివర్గం నుంచి తొలగిస్తే తప్ప తన మద్దతు కొనసాగదని ములాయం భీష్మించుకొని వున్నాడు. దానితో యుపిఏ సర్కారు అస్తిత్వం అనుమానంలో పడిపోయింది.

జమీన్‌రైతు

ములాయంను మచ్చిక చేసుకోగల్గితేనే సర్కారుకు మనుగడ. లేదంటే, లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు తప్పవు. అయితే మధ్యంతర ఎన్నికలకు ఉత్తరప్రదేశ్‌కే చెందిన మాయావతి సిద్ధంగా లేదు. ఇప్పుడు ఎన్నికలు జరిగితే ములాయం గెలుస్తాడని ఆమె భయం. అందువల్ల కాంగ్రెస్‌కు దూరమైపోయిన మమత బెనర్జీని మళ్లీ వెనక్కు తెచ్చి ప్రభుత్వాన్ని నిలబెట్టాలని ప్రయత్నిస్తున్నారామె. మరొకప్రక్క బిజెపి నరేంద్ర మోడితో సంబంధాలు చెడిన బీహార్ ముఖ్యమంత్రి నితీష్‌కుమార్ కూడా యుపిఏతో జత కట్టాలని చూస్తున్నాడు. ఆ రెండూ జరిగితే ప్రధానిగా మన్మోహనుడు మరొక ఏడాది కొనసాగుతాడు. లేదంటే దేశ ప్రజానీకం మరొకసారి ఎన్నికలకు సిద్ధంకాక తప్పదు. ఇప్పటికిప్పుడు ఎన్నికలొస్తే తమదే గెలుపన్న ధీమాతో బిజెపి ఆతృత పడుతున్నది.

## జనవాణి

### గోవిందుడి రూపుతో గడియారం సముచితమే!

తిరుపతి వెంకన్న భారతీయుల ఆరాధ్య దైవం. ఆయన రూపును ముద్రించిన గడియారాలపై ఎందుకింత విమర్శో అర్థం కావడం లేదు. బ్రాందీ షాపులకు పేరు పెట్టుకోంగా లేంది గడియారంలో పెట్టుకొంటే ఏమి పొయ్యింది. కాంట్రాక్టర్లు, రాజకీయ నాయకులు, వ్యాపారస్తులు, దొంగలు, హంతకులు, నీచ కార్యాలు చేసే దగుల్బాజీలు, చండాలమైన పనులు చేసి పర్సెంటేజీలు సమర్పిస్తే తీసుకొనే నగలు, నగదు ఇతరాల కంటే ఈ వ్యవహారం ఛండాలమైనదా? ఇది సముచితమే. అయితే ఒక సలహా. వెంకటేశుని ముద్రించిన గడియారాలను ఆ కంపెనీకి ఆర్డరిచ్చి చేయించి తిరుపతి దేవస్థానం వారే భక్తులకు అమ్మితే ఇంకా ఎంతో డబ్బు వస్తుంది. మంచి కార్యాలకు ఉపయోగపడుతుంది. ప్రచారమూ జరుగుతుంది.

తూపిలి వనమాలి నెల్లూరు

### వివాదాల్లో రెవిన్యూ అధికారులు!

రెవిన్యూ శాఖాధికారులు రాజకీయ నాయకులకు అనుకూలంగా వ్యవహరిస్తున్నారని 'జమీన్‌రైతు'లో వ్రాస్తుంటారు. వాస్తవాన్ని పరిశీలిస్తే శాసనసభ్యుని పిలుపు వస్తే తహశీల్దార్ వారి ఇంటికి పరుగెత్తాలి. లేకపోతే బదలీ, ఇంక యేమి చేస్తారో చెప్పలేం. రెవిన్యూ శాఖలో సమస్యలు ఉత్పన్నమైతే జిల్లా కలెక్టర్ సమస్యను బట్టి జాయింట్ కలెక్టర్, డిఆర్వోలను కలవమని చెబితే బాగుంటుంది. అన్నీ వ్యవహారాలు తానే చూస్తే తడ తహశీల్దార్ కార్యాలయంలో మాదిరి గొడవలు చోటు చేసుకొంటాయి. పాత రోజుల్లో మాదిరి ప్రభుత్వ కార్యాలయాలకు రాజకీయ నేతల నుంచి స్వేచ్ఛ ఎప్పుడు లభిస్తుందో? 'జమీన్‌రైతు'లో వివిధ వివాదాలకు పరిష్కారాలు చెబితే బాగుంటుంది.

రాళ్లపల్లి రామసుబ్బారావు నెల్లూరు

### బడ్జెట్ బాగుంది!

భారత ఆర్థిక మంత్రి చిదంబరం లోక్‌సభలో ప్రవేశపెట్టిన బడ్జెట్ చాలా బాగుంది. మన దేశంలో ప్రస్తుతమున్న వనరులను బట్టి ఇంతకన్నా మెరుగైన బడ్జెట్ సమర్పించడం ఏ పార్టీకి, అది నడిపే ప్రభుత్వానికి వీలుకాదు. కానీ ఈ నాటి నిత్యావసర వస్తువుల ధరలను దృష్టిలో పెట్టుకొని టాక్స్ లిమిట్‌ను రెండు లక్షల రూపాయల నుంచి మూడు లక్షల రూపాయలకు పెంచి ఉంటే బాగుండేది.

వొమ్మిన సుబ్రహ్మణ్యం నెల్లూరు

### ఇదా క్రీడాస్ఫూర్తి?

సచిన్ అని పలికేలోగానే క్రికెట్ బంతిని బౌండరీ లైను దాటించగల ధీరుడు. హా... సెహ్వాగ్ అని పిలిచే లోగానే బంతిని గాలిలోకి బాది సిక్సర్

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

26-3-1943
పేజీలు : 4 వెల: 0-2-0

### నెల్లూరు ముచ్చట్లు
### సంతోష వార్త

మన పుచ్చలపల్లి సుందరయ్య కామ్రేడ్ లీలను వివాహం జేసుకొని ఓ ఇంటి వాడయ్యాడు. స్టాలిన్ కృపాకటాక్షవీక్షణామృతమున పదికాలాలపాటు సుఖంగా వర్ధిల్లుదురుగాక.

వయో వృద్ధులగు వెంకట్రామశాస్త్రి గారు డాక్టర్ అచ్చమాంబ యందు పుత్రీ సంతానాన్ని పొందినాడన్న సంతోష వార్త గూడా మీకు వినిపిస్తున్నాను.

### ఎలక్షన్

జిల్లా బోర్డుకు గోవిందయ్య, అబ్బయ్యనాయుడు గార్లను ఎన్నుకొన్నారు. ఉపాధ్యక్ష వర్గీకరణం వెరీ బ్యాడ్ సెలక్షన్. అధ్యక్షుల ముమ్ముందు చండాల కార్యక్రమానికి ఈ రథ చోదకుదుండాలె కాబోలు.

వా!రే!!వా!!!

### ఆగాఖాన్ ప్యాలెస్

గాంధీజీని పూనాలో ఆగాఖాన్ రాజ ప్రసాదంలో వుంచినారని అంటే ఏమో అనుకొన్నాము. కానీ చూడగానే బ్రిటీషు వారి ప్రచారక విధానానికి మాత్రం ఆశ్చర్యమేసింది. ప్యాలెస్ అని లోకానికి చాటి, గాంధీజీని ఒక రాజ ప్రసాదంలో బెట్టి అన్ని వసతులు కల్పించినామని చెప్పను. ప్యాలెస్ అనే మాట ఎన్నడు గాని జాదవిడువరు. కానీ అది నేతిబీరకాయ – నివాసయోగ్యం కాని పాత బంగళా. నీటి వసతిలేని పాడు కొంప. నెల్లూరులో పాడుబడ్డ బజారుకు 'కలశ మహల్' అన్నట్లున్నది. ఇంతకు ముందు వుపవాసం చేసిన వర్లకుటి దీనికి ఎదురుగా కొండమీద విరాజిల్లుతున్నది. ఇప్పుడిది పార్సీ యువతీ శరణాలయం.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

22-3-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు
### రాఘవ విహార్ విందు

లక్ష్మణగుప్త(కొత్త ఛైర్మన్), పి.వి.సుబ్బారెడ్డి(వైస్ ఛైర్మన్) గారల గౌరవార్థం, రాఘవ విహార్ స్వంతదారు మన్నెం శ్రీనివాసులురెడ్డి తన హోటల్‌లో పరిభాగ వుద్యానంలో 20వ తేది రాత్రి విందుజేసి, విందు అనంతరం తన కుమారులైన అమరనాధ్ – శ్రీనాధులచే వారిని మాలాంకృతులను గావించి సత్కరించారు.

శ్రీనివాసులురెడ్డి పక్షంగా డాక్టరు ఎం.వి.కృష్ణారెడ్డి గారు ఆహుతులకు ధన్యవాదాలు చెప్తూ; సయోధ్యంగా మునిసిపల్ పాలనను నెరపవలసిందని, పన్నులు పెంచకుండా పౌర సౌకర్యాలను పెంచవలసిందని ముఖ్య అతిథులిరువురిని కోరారు. అభిమానుల ఆశలను వమ్ము చేయబోమని గుప్త – రెడ్డి గారలు సమాధానం చెప్పారు.

### హోటళ్ల సంఘం

సంఘ ఉపాధ్యక్షుడు, న్యాయవాది ఎస్.రంగస్వామి అధ్యక్షతన 17వ తేది జరిగిన నెల్లూరు హోటళ్ల సంఘ సమావేశంలో నూత్నవత్సరానికి స్నేహపాత్రులు సి.చెంచురెడ్డి(రమణ విలాస్), ఎం.ఎస్.సూర్యనారాయణ(చంద్రభవన్) గారలు అధ్యక్ష, కార్యదర్శులుగా, ఎన్.రంగస్వామి బి.ఏ,బి.ఎల్., ఉపాధ్యక్షుడుగా, హోటల్ పేరును పదార్థాల స్థాయిని, తరగకుండా తగ్గకుండా కాపాడుకుంటున్న వ్యాపారదక్షుడు పి.ఎస్.వెంకటాచలం(కోమల విలాస్) కోశాధికారిగా, శ్రీయుతులు వి.రాజమణి(రాజాస్ కేఫ్), ఎమ్వీ శేషయ్య(పార్వతి పరమేశ్వరం విలాస్), ఏ.సుబ్బరామయ్య(అంబిక), కె.నాగేశ్వరరావు(లక్ష్మీ విలాస్), పి.కె.ఉద్దరన్(బాంబే హోటల్) గారలు సభ్యులుగా ఎన్నుకోబడినారు.

# నెల్లూరు ముచ్చట్లు

## విశేషాలు




## నెల్లూరు శాస్త్రవేత్తకు ప్రతిష్ఠాత్మక అవార్డు!

నెల్లూరీయుడు డిఆర్‌డిఓ మిసైల్స్ విభాగంలో శాస్త్రవేత్త జి.సతీష్‌రెడ్డికి ప్రతిష్ఠాత్మక డాక్టర్ బిరేన్ రాయ్ స్పేస్ సైన్స్ అండ్ డిజైన్ అవార్డు ప్రకటించారు. ఇటీవల హైదరాబాద్‌లోని ఏరోనాటికల్ సొసైటీ ఆఫ్ ఇండియా ప్రాంగణంలో జరిగిన ప్రత్యేక సమావేశంలో ఈ అవార్డును కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రి పళ్లంరాజు సతీష్‌రెడ్డికి అందించారు. ఈ కార్యక్రమంలో జిఎంఆర్ గ్రూప్ ఛైర్మన్ జిఎంరావు, డిఆర్‌డిఓ డైరక్టర్ జనరల్ డాక్టర్ పి.కె.సారస్వత్ తదితరులు పాల్గొన్నారు.

సతీష్‌రెడ్డి స్వగ్రామం మహిమలూరు. సామాన్య రైతు కుటుంబంలో పుట్టిన ఈయన హైదరాబాద్‌లోని రీసెర్చ్ సెంటర్ ఇమ్రాత్(ఆర్‌సిఐ) అసోసియేట్ డైరక్టర్‌గా పనిచేయడం జిల్లా ప్రజలందరికీ గర్వకారణం.

## స్వంత జిల్లాపై మమకారమేది?

రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి 18వ తేది అసెంబ్లీలో ప్రవేశపెట్టిన బడ్జెట్‌లో స్వంత జిల్లా నెల్లూరుకు చెప్పుకోతగ్గ కేటాయింపులు చేయక పోవడం విమర్శకు తావిచ్చింది. నెల్లూరులో మెడికల్ కాలేజి ఏర్పాటుకు గత ఏడాదిగా విడుదల చేస్తున్నట్లు చెప్పిన 352 కోట్ల రూపాయల నిధులను ఈ సారి బడ్జెట్‌లో కేటాయించడం మినహా చెప్పుకోతగ్గ అంశాలేమీ లేవు. నెల్లూరు నూతన కలక్టరేట్, ఆత్మకూరు, నాయుడు పేట, నెల్లూరు ఆర్డీఓ ఆఫీసుల నిర్మాణానికి నిధుల మంజూరుతోపాటు నెల్లూరు అర్బన్ మండల ఏర్పాటు మాత్రం రామనారాయణరెడ్డి ఓకే అనడం మినహా ఆనం మార్క్ బడ్జెట్‌లో ఆయన ఇంతకు ముందు టీవీ ఇంటర్వ్యూలలో పేర్కొన్నట్లుగా పెద్ద కేటాయింపులు లేవు.

## క్షణాల్లో పట్టాదారు పాసు పుస్తకం?

జిల్లాలో జరుగుతున్న రెవిన్యూ సదస్సుల్లో రైతులు తమ దగ్గరున్న ఆధారాలు పొందుపరిస్తే క్షణాల్లో పట్టాదారు పాసు పుస్తకం ఇవ్వను ఏర్పాటు చేసినట్లు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం ప్రకటించారు. గ్రామాల్లో ఈ సదస్సులు జరిగే సమయంలో విద్యుత్‌కోత వల్ల ఈ పాసు పుస్తకాలను ఇవ్వలేక పోతున్నట్లు తహశీల్దార్లు ఈ సదస్సుల్లోనే ప్రకటించడం విశేషంగా చెప్పుకోవచ్చు.

## నెల్లూరు మాస్టర్ ప్లాన్ తయారు!

నెల్లూరు కార్పొరేషన్ మాస్టర్ ప్లాన్‌ను 18వ తేది మునిసిపల్ మంత్రి మానుగుంట మహీధర్‌రెడ్డి హైదరాబాద్‌లో ఆవిష్కరించారు. ఈ పుస్తక ప్రతి, సిడి ఇంకా పాత్రికేయుల చేతి వరకు రాలేదు. వస్తే దాన్ని పరిశీలించి ఎలా రూపొందించారో వివరంగా వ్రాస్తాం.

## గుడెం చేసింది?

నెల్లూరు ముత్తుకూరు రోడ్డు విస్తరణ పనుల్లో భాగంగా రోడ్డు ప్రక్కనున్న నిర్మాణాలన్నీ తొలగించారు. కానీ మహాలక్ష్మమ్మ గుడి, ఓ చర్చి, మసీదును మాత్రం వదిలి వేశారు. కానీ 17వ తేది అర్థరాత్రి ఆర్‌అండ్‌బి అధికారులు గుడిని మాత్రం కూల్చేయడం ఉద్రిక్తతకు దారి తీసింది. ఇక్కడ గుడి, చర్చి, మసీదు ఏర్పాటు తప్పో ఒప్పో వాదన అనవసరం. కానీ ఒక్క గుడిని మాత్రం కూల్చడం పెద్ద తప్పు. సమన్యాయం వర్తింపజేయాలన్న బాధ్యత అధికారులకు లేదా?

## కెమిస్ట్రీ పేపర్ లీక్?

ఇంటర్ ద్వితీయ సంవత్సరం కెమిస్ట్రీ ప్రశ్నాపత్రం లీక్ అయిందన్న ప్రచారం నగరంలో ఆ పరీక్ష వ్రాసిన విద్యార్థులను ఆందోళనకు గురి చేసింది. నగరంలో వివిధ సెంటర్లల్లో ఇంటర్ పరీక్షలు నిర్వహించారు. మార్చి 19వ తేదితో సీనియర్ ఇంటర్ పరీక్షలు ముగిశాయి. హరనాధపురంలో గల నారాయణ కళాశాల పరీక్షా కేంద్రంలో పరీక్షా సమయానికి అరగంట ముందే ప్రశ్నాపత్రాలు బయటకు వచ్చాయంటూ విద్యార్థి సంఘాలు గొడవ చేశాయి. ప్రశ్నాపత్రాల్లోని ప్రశ్నలే పరీక్ష ప్రారంభానికి ముందు పలువురు సెల్‌ఫోన్‌లకు మెసేజ్ రూపంలో రావడం, వాటినే చదువుకొని పలు కళాశాలల నిర్వాహకులు చెప్పడం, పరీక్షలో అవే ప్రశ్నలు రావడం లీకేజీలో భాగమేనని ఆందోళనకు దిగాయి. దీంతో కలకలం రేగింది. సమాచారం అందుకొన్న ఆర్‌ఐఓ పరంధామయ్య అక్కడకు చేరుకొని అలాంటిదేమీ లేదని తేల్చి పారేశారు. విద్యార్థి సంఘాల నాయకులకు కాలేజీల నిర్వాహకులు ఇస్తారన్న మామూళ్లు పరీక్షల చివరి రోజు వరకు ఇవ్వక పోవడం వల్లే ఈ గొడవ రేగిందంటున్నారు.



**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## రచయితల సంఘం

నెల్లూరు జిల్లా రచయితల సంఘం నూతన కార్యవర్గ ఎన్నిక 17వ తేది టౌన్‌హాలు రీడింగ్ రూమ్‌లో జరిగింది. అధ్యక్షునిగా ఎ.జయప్రకాష్, ఉపాధ్యక్షురాలిగా వాయుగుండ్ల శశికళ, ప్రధాన కార్యదర్శిగా మాటేటి రత్నప్రసాద్, సహాయ కార్యదర్శిగా ములుగు లక్ష్మీ మైథిలి, కోశాధికారిగా సింగరాజు శ్రీనివాసకుమార్‌లను ఎన్నుకొన్నారు. కార్యవర్గంలోనికి రచయితలు కాని వారిని తీసుకోవడం, సభ్యత్వాలు రెన్యువల్ చేయకపోవడంపై రచయితల సంఘం విమర్శను ఎదుర్కొంటుంది.

## గోల్డ్‌ఫీల్డ్స్ క్లాస్ నూతన భవన ప్రారంభం

వరికోత యంత్రాల తయారీలో అగ్రగణ్యులైన క్లాస్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్ వారి ప్రత్యేక షోరూంను నెల్లూరులో అధీకృత పంపిణీదారులైన గోల్డ్ ఫీల్డ్స్ ఆధ్వర్యంలో ఆటోనగర్‌లో క్లాస్ గ్లోబల్ సేల్స్ ఆసియా విభాగపు రీజనల్ డైరక్టర్ డాక్టర్ జెన్స్ఓడింగ్ 13వ తేది ప్రారంభించారు. ఈ కార్యక్రమానికి విచ్చేసిన ఆహుతులకు స్వాగతం పలుకుతూ గోల్డ్‌ఫీల్డ్స్ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ బి.ఎల్. కార్తీక్ మాట్లాడుతూ 1994లో 'క్లాస్' డీలర్‌షిప్ తీసుకొన్న ఆ రోజుల్లో వరికోతను ఇష్టపడేవారు కాదని, అయితే ఈ రోజు హార్వెస్టర్ యంత్రం లేకుండా వరికోత జరగడం లేదన్నారు. జెన్స్ ఓడింగ్ మాట్లాడుతూ క్లాస్ కంపెనీ సరిగ్గా వందేళ్ల క్రితం 1913లో ప్రారంభించి, ఇప్పటిదాకా ఆరువేల వరికోత యంత్రాలను విక్రయించామని అందులో 1200 గోల్డ్‌ఫీల్డ్స్ విక్రయించిందన్నారు. క్లాస్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్ వైస్ ప్రెసిడెంట్ అమితాసూద్, శ్రీనివాస్ పి.కామిశెట్టి, గోల్డ్‌ఫీల్డ్ మేనేజింగ్ డైరక్టర్ జి.కె.కుమార్, హరీష్ ఖాతాదారులకు బహుమతుల ప్రదానం చేశారు.

## పాతకాపులకే యుటిఎఫ్ సారథ్యం!

16, 17 తేదీలలో నెల్లూరులో జరిగిన యుటిఎఫ్ జిల్లా మహాసభల్లో నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా సి.హెచ్.శ్రీహరి, సహాధ్యక్షులుగా డి.గోపాల్, పి.రమాదేవి, ప్రధాన కార్యదర్శిగా కె.పరంధామయ్య, కార్యదర్శులుగా ఎం.మస్తానయ్య, జి.వి.భాస్కర్, ఎస్పీ సుబ్బారావు, పి.జనార్ధనం, జి.జె.రాజశేఖర్, కె.తులసీ రాంబాబు, పి.ప్రసాద్, ఎ.మురళీధరరావు, పి.వి. శేషులు, ఎన్.నవకోటేశ్వరరావు, కె.చంద్రశేఖర్‌రెడ్డి, జి.వి.చలపతి శర్మ, జి.సుబ్బారాయుడు, ఎస్డీ వలీ అహ్మద్, జి.వెంకటేశ్వర్లు, జి.నాగేశ్వరరావు, పి.చిరంజీవి, టి.స్వర్ణలతను ఎన్నుకొన్నారు. ఆడిట్ కమిటీ కన్వీనర్‌గా ఓ.వెంకటేశ్వరరావు, కుటుంబ సంక్షేమ కార్యదర్శిగా షేక్ ఖాదర్‌బాషలను నియమించారు. ఎన్నికల అధికారిగా రాష్ట్ర కార్యదర్శి ఎం.వెంకటేశ్వరరెడ్డి వ్యవహరించారు. పాతకాపుల చేతికే యుటిఎఫ్ నాయకత్వం ఇవ్వడంపై సమావేశంలో కాసింత గందరగోళం చోటుచేసుకొంది. అయినా ఓ సంఘానికి ఎంతమంది కార్యదర్శులండీ బాబు? అయ్యోర్లకు అన్ని రకాల ఆశలతోపాటు పదవీకాంక్ష కూడా ఎక్కువయ్యిందని ఈ ఎన్నిక చెప్పకనే చెప్పింది.

## తాజ్‌మహల్ ముంగిట పెరుగు కవిత్వం!

యమునా నది ఒడ్డున గల తాజ్ మహల్ ముంగిట 11, 12 తేదీల్లో జరిగిన సార్క్ దేశాల సాహిత్య సదస్సులో ప్రముఖ కవి దంపతులు పెరుగు రామకృష్ణ, సుజనారామం ఆహ్వానిత కవులుగా హాజరై కవితాగానం చేశారు. ఈ సదస్సులో పెరుగు రామకృష్ణ తాజా కవిత్వ సంపుటి 'పూలమ్మిన ఊరు'ను సాహిత్య సదస్సు అధ్యక్షురాలు, పంజాబీ రచయిత్రి పద్మశ్రీ అజిత్‌కోర్ ఆవిష్కరించారు.

## డాక్టర్ బాలచెన్నయ్య నియామకం పట్ల హర్షం

గూడూరు నియోజకవర్గం వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సమన్వయ కర్తగా డాక్టర్ పి.బాలచెన్నయ్య నియామకం పట్ల ఆ పార్టీ గూడూరు నాయకుడు శ్రీకిరెడ్డి భాస్కర్‌రెడ్డి హర్షం వ్యక్తం చేశారు. ప్రజాభీష్టం ప్రకారం ఈ ఎంపిక చేసిన పార్టీ గౌరవాధ్యక్షురాలు వైఎస్ విజయమ్మకు కృతజ్ఞతలు తెలియజేశారు. బాలచెన్నయ్య నాయకత్వంలో గూడూరులో పార్టీ మున్ముందుకు సాగుతుందన్న ఆశాభావాన్ని భాస్కర్‌రెడ్డి వ్యక్తం చేశారు.

## విద్యార్థులకు అట్టల పంపిణీ!

పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ నేతృత్వంలో బుజబుజనెల్లూరు

కొరవ 14వ పేజీలో

# జూలు విదిల్చిన ఎసిబి!

**● నెల వ్యవధిలో మూడు శాఖలపై పంజా**

అక్రమార్కుల గుండెల్లో గుబులు మొదలైంది. చేయి తడపందే ఫైలు కదిలించని అవినీతిపరులకు ముచ్చెమటలు పడుతున్నాయి. అవినీతిపరుల వెన్నులో వణుకు మొదలైంది. దీనికి కారణం గత కొంత కాలంగా నిస్త్రాణంగా, ఎలాంటి చడీచప్పుడు లేకుండా వున్న ఎసిబి ఒక్కసారి జూలు విదిలించి పలు శాఖలపై దాడులు చేయడమే. గతంలో ఎసిబి డిఎస్పీగా చౌదరి వున్న కాలంలో అవినీతిపరులకు వణుకు పుట్టింది ఎసిబి పేరు చెప్తే. తర్వాత అలాంటి ముద్ర వేయలేక పోయింది. తిరిగి ఇప్పుడు డిఎస్పీ భాస్కర్‌రావు ఊహించని విధంగా ఒక్కొక్క శాఖపై నిఘాపెట్టి తనదైనశైలిలో అవినీతిపరుల భరతం పట్టేందుకు నడుం బిగించడంతో కలకలం మొదలైంది. వైద్య ఆరోగ్య శాఖకు సంబంధించిన బిల్లుల మంజూరుకు లంచం తీసుకొంటుండగా ఖజానా కార్యాలయంపై దాడిచేసి అక్కడి సిబ్బందిని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకొని, 65వేల రూపాయలు స్వాధీనం చేసుకొన్నారు. తర్వాత పరిశ్రమల శాఖాధికారులు దొరికారు. ధృవీకరణ పత్రాల కోసం 30వేల రూపాయలు తీసుకొంటుండగా వారు ఎసిబికి చిక్కారు. ఇటీవల రవాణాశాఖ కార్యాలయంపై పకడ్బందీగా ముందస్తు వ్యూహంతో దాడిచేసి అవినీతిపరులైన సిబ్బందిని, ప్రభుత్వ నిబంధనలకు విరుద్ధంగా పైరవీలు చేస్తున్న ఏజెంట్లను అరెస్టు చేశారు. కార్యాలయంలో కీలక పత్రాలను, పెద్దమొత్తంలో నగదును స్వాధీనం చేసుకొన్నారు. గత కొంతకాలంగా రవాణా శాఖలో అవినీతి హెచ్చుమీరిందని, డబ్బు ముట్టచెప్తే కానీ ఏజెంట్లు, కొందరు సిబ్బంది తిమ్మినిబమ్మిగా చేస్తారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఈ నేపథ్యంలో ఎసిబి డిఎస్పీ భాస్కర్‌రావు సామాన్యుడిగా వెళ్లి ఏజెంట్లకు డబ్బు లిచ్చి వారి అనుపానులు తెలుసుకొని రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకోవడం సంచలనం కల్గించింది. తాజాగా వింజమూరు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు బుజ్జయ్య డిఎడ్ విద్యార్థులకు ధృవీకరణ పత్రాలిచ్చేందుకు లంచం తీసుకొంటుండగా ఎసిబి అధికారులు పట్టుకొన్నారు. ఉపాధ్యాయులకు జీతం తప్ప గీతం లేదనుకొనేవారు. ఈ అయ్యోరి అవినీతితో అది తప్పని తేలిపోయింది. ఒక్కసారిగా ఎసిబి విజృంభించి అవినీతిపరుల భరతం పడుతుండడంతో పలు శాఖల్లో జలగల్లామారి అవినీతి సొమ్ము బొక్కుతున్న వారు వణికి పోతున్నారు. ఇలాగే ఎసిబి అధికారులు తమ జోరు కొనసాగిస్తే జిల్లాలో అవినీతి కొంతైనా తగ్గుముఖం పడుతుంది.



రవాణా శాఖాధికారి కార్యాలయంలో తనిఖీలు చేస్తున్న ఎసిబి అధికారులు.



జెకెకు జీవిత సాఫల్య పురస్కారం అందజేస్తున్న దృశ్యం.

**● జె.కె.రెడ్డికి**

# జీవిత సాఫల్య పురస్కారం!

**పండుగలా ప్రదానోత్సవ సభ**

శాసనసభ్యునిగా సింహపురి అభివృద్ధికి ఎనలేని కృషిచేసిన జక్కా కోదండరామిరెడ్డి(జెకెరెడ్డి) దాతృత్వంలోనూ తనకు తానే సాటి అని పలుమార్లు నిరూపించుకొన్నారని వక్తలు కొనియాడారు. హాస్యనటుడు దోర్నాల హరిబాబు స్థాపించిన హరివిల్లు క్రియేషన్స్ జెకెకు జీవిత సాఫల్య పురస్కార ప్రదానోత్సవ సభ మార్చి 17వ తేది సాయంత్రం ఆత్మీయులు, అభిమానులు, కళాకారులు, కళా హృదయుల నడుమ వేడుకగా జరిగింది. ఈ సందర్భంగా పలువురు తమ ప్రసంగంలో జెకెరెడ్డి దాతృత్వాన్ని ప్రశంసించారు. సినీ నిర్మాత, నెల్లూరీయుడు సి.కళ్యాణ్ మాట్లాడుతూ దాతృత్వంలో నెల్లూరీయులే ముందుంటారన్నారు. జెకెరెడ్డికి లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్ అందజేసే కార్యక్రమంలో పాల్గొనడం ఆనందంగా వుందన్నారు. సినీ హాస్యనటులు అనంత్, గుండు హనుమంతరావులు మాట్లాడుతూ దానగుణం, గానగుణం నెల్లూరీయుల సొంతమన్నారు. ఎమ్మెల్యేగా తనదైన ముద్రవేసిన వ్యక్తి జెకెరెడ్డి అని, ఎందరికో సహాయం చేసిన ఆయనకు గవర్నర్ పదవి ఇవ్వాలని హోటల్స్ అసోసియేషన్ రాష్ట్ర కార్యదర్శి అమరావతి కృష్ణారెడ్డి డిమాండ్ చేశారు. అనంతరం గజమాల, పూలకిరీటంతో ఆయన్ను ఘనంగా సన్మానించారు. అవార్డు గ్రహీత జెకెరెడ్డి మాట్లాడుతూ జీవిత సాఫల్య పురస్కారాన్ని అందుకోవడం సంతోషంగా వుందని, జీవితంలో ఇది మధురానుభూతిని కల్గించిందన్నారు. తనకు ఈ అవార్డును ప్రదానం చేసిన హరివిల్లు క్రియేషన్స్‌కు కృతజ్ఞతలు తెలిపారు. ఈ కార్యక్రమంలో రత్నం విద్యాసంస్థల ఛైర్మన్ కె.వి. రత్నం, జెఎస్‌రెడ్డి, జెవిరెడ్డి, మురళీకృష్ణ 70 అధినేత హజరత్‌బాబు, శివప్రభాత్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# ఆగని అక్రమ రవాణా!

**● పట్టించుకోని పౌరసరఫరాల శాఖ**

అధికారులు ఎన్ని హెచ్చరికలు చేసినా, తనిఖీలు జరుపుతున్నా సన్నబియ్యం అక్రమరవాణా యదేచ్ఛగా జరుగుతోంది. బియ్యం ధరలు ప్రస్తుతం 45 రూపాయలకు చేరుకోవడంతో కొందరు అక్రమ వ్యాపారులు బిపిటి రకం ధాన్యంలో తక్కువ రకం బియ్యాన్ని కల్తీచేసి, పాలిష్ పట్టి చెన్నైకి ఎగుమతి చేస్తున్నారు. జిల్లాలోని వివిధ ప్రాంతాల్లో గోడౌన్లలో నిల్వచేసి పెట్టుకొన్న ఈ బియ్యాన్ని అక్రమార్కులు సరిహద్దులు దాటించి తమిళనాడుకు తరలిస్తున్నారు. అధికారుల పర్యవేక్షణ కొరవడడం, నిఘా లోపించడం, మామూళ్ల మత్తులో జోగుతున్న అధికారుల కారణంగా ఎలాంటి ఆటంకాలు లేకుండా సన్నబియ్యం అక్రమ రవాణా జరిగి పోతోంది. తడ చెక్‌పోస్టు వద్ద అధికారులు అడిగినంత ముట్టజెప్తే ఎలాంటి ఇబ్బంది లేకుండా బియ్యాన్ని రవాణా చేసుకోవచ్చని అక్రమ వ్యాపారులు బహిరంగంగా వ్యాఖ్యానిస్తున్నారట. ఒక్కో లారీకి ఐదువేల రూపాయల వరకు స్మగ్లర్ల నుంచి చెక్‌పోస్టు సిబ్బంది కొందరు ముడుపులు అందుకొని అంతా సక్రమమనే తరహాలో పంపేస్తుండడంతో సన్నబియ్యం అక్రమ వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా జరిగిపోతోంది. ఎప్పుడైనా అధికారులు తనిఖీలు జరిపినపుడు మాత్రం అరకొరగా దొరకడం తప్ప ఈ అక్రమ రవాణాకు ఇబ్బందులు లేకుండా పోతున్నాయి. అధికారుల తీరు వలన వర్షాభావం, సాగునీరు అందక వరిసాగు అనుకొన్నంతగా జరగలేదు. సోమశిలకు పూర్తిస్థాయిలో నీరు చేరకపోవడంతో దీనిని ఆసరాగా చేసుకొని కృత్రిమ కొరత సృష్టించి బియ్యం ధరలను అమాంతం పెంచేస్తున్నారు. ఏడాదికో శివరాత్రి అన్న చందంగా ఒకటి, అర తనిఖీలు చేయడం కాకుండా ఎక్కడికక్కడ నిఘాపెట్టి కఠినంగా వ్యవహరిస్తే ఈ అక్రమ రవాణాకు అడ్డుకట్ట పడుతుంది.

# మలేరియా నిర్ధారణ ఎట్లా?

**పెరిగి పోతున్న కేసులు**

వ్యాధులను అరికట్టేందుకు అన్ని చర్యలు తీసుకుంటున్నామని అధికారులు ప్రకటిస్తున్నప్పటికీ వాస్తవ పరిస్థితులు మాత్రం దీనికి భిన్నంగా వుంటున్నాయి. తగినంత సిబ్బందిలేక, వున్న సిబ్బంది అరకొరగా వుండడం, వైద్యశాఖ అధికారులు శ్రద్ధ చూపలేక పోవడంలాంటి కారణాలతో జిల్లాలో వివిధ ఆరోగ్య పరీక్షలు జరగడం లేదు. దీనికి ఉదాహరణ మలేరియా నిర్ధారణ పరీక్షలు. ఈ కేసులు రోజురోజుకు పెరుగుతున్నాయి. దోమల కారణంగా వచ్చే మలేరియాను రక్త పరీక్షల ద్వారా నిర్ధారిస్తారు. అలాంటి పరీక్షలు చేసేందుకు సిబ్బంది లేకపోవడంతో రక్త సేకరణ తప్ప పరీక్షల నిర్వహణ జిల్లాలో ప్రశ్నార్థకంగా మారింది. ప్రజలకు మెరుగైన వైద్యం అందించేందుకు, సత్వర వైద్యం అందుబాటులోకి తెచ్చేందుకు జిల్లావ్యాప్తంగా 74 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 447 ఉప ఆరోగ్య కేంద్రాలు, 14 సామాజిక ఆరోగ్య కేంద్రాలు, వీటిని పర్యవేక్షించేందుకు 17 క్లస్టర్ కార్యాలయాలున్నాయి. వైద్య ఆరోగ్య శాఖలో ప్రత్యేకంగా మలేరియా విభాగం వుంది. ఇన్ని ఆరోగ్య కేంద్రాలు వున్నా, ప్రత్యేక విభాగం పనిచేస్తున్నప్పటికీ రక్త పరీక్షలు జరిపే ల్యాబ్ టెక్నీషియన్లు తగినంత మంది లేకపోవడంతో ఈ పరీక్షలు చేసేందుకు సిబ్బంది కొరత పట్టిపీడిస్తుంది. ఫలితంగా వ్యాధినిర్ధారణ చేసేందుకు అనువైన పరిస్థితులు లేవు. జిల్లా వ్యాప్తంగా వివిధ ఆరోగ్య కేంద్రాల ద్వారా సేకరించిన రక్తాన్ని పరీక్ష జరిపి మలేరియా వ్యాధిని నిర్ధారించేందుకు ల్యాబ్ టెక్నీషియన్లు లేకపోవడంతో ఆ రక్తాన్ని మలేరియా విభాగంలో కట్టలు కట్టి పడేయాల్సి వస్తుంది. దీంతో విషజ్వరాల బారిన పడేవారిని గుర్తించడంలో వైద్యశాఖ విఫలమౌతోంది. అధికంగా దోమలు ఉత్పత్తి అవుతుండడంతో పలువురు మలేరియా బారినపడుతున్నారు. ప్రభుత్వ వైద్యశాలల్లో వాటి నిర్ధారణ జరగకపోవడంతో ప్రైవేట్ ఆస్పత్రుల్లో చికిత్స పొందాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

# ఉగాదికి స్త్రీ శక్తి భవనాలు!

జిల్లాలోని స్త్రీ శక్తి భవనాల నిర్మాణ పనులు ఉగాదికల్లా పూర్తయ్యేలా చర్యలు చేపట్టాలని డ్వామా పిడి ఎం.గౌతమి పంచాయితీరాజ్ ఇంజనీర్లను ఆదేశించారు. 15వ తేది డ్వామా కార్యాలయంలో స్త్రీ శక్తి భవనాలు, వ్యక్తిగత మరుగుదొడ్ల నిర్మాణ పనులు పురోగతిపై పంచాయితీరాజ్ ఈఈలు, డ్వామా అధికారులతో సమీక్షించారు. అనంతరం విలేకరులతో గౌతమి మాట్లాడుతూ జిల్లాలో 42 స్త్రీ శక్తి భవన నిర్మాణాలు పంచాయితీరాజ్ ఈఈ ఆధ్వర్యంలో జరుగుతున్నాయన్నారు. వీటితోపాటు మరో 363 గ్రామ రెవెన్యూ భవనాలు మంజూరయ్యాయన్నారు. 211 భవన నిర్మాణాలు పూర్తి కావస్తున్నాయన్నారు. ఉగాదిలోపు స్త్రీశక్తి, గ్రామ రెవెన్యూ భవన నిర్మాణాలు పూర్తిచేసి ప్రారంభించేందుకు చర్యలు తీసుకొంటున్నట్లు తెలిపారు. భవన నిర్మాణాల్లో నాణ్యత లోపించకుండా ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని అధికారులను ఆదేశించారు. సమావేశంలో డ్వామా ఏపిడి వాసుకి, పంచాయితీరాజ్ ఈఈలు పాల్గొన్నారు.

# మేత పోరంబోకు భూముల ఆక్రమణ!

## ఉదయగిరి అంతా ఇదే వరుస

ఉదయగిరి నియోజకవర్గంలో మేత పోరంబోకు భూములు ఆక్రమణల పాలవుతున్నాయి. మూగజీవాలకు ఆహారాన్ని అందించేందుకుగాను వున్న భూములను ఎవరికి వారు ఆక్రమించేసుకొంటుండడంతో పశువులకు మేత దొరకని పరిస్థితి తలెత్తుతోంది. నియోజకవర్గ పరిధిలోని కొండాపురం, వరికుంటపాడు, దుత్తలూరు, కలిగిరి, సీతారామపురం, ఉదయగిరి మండలాల్లో ఈ ఆక్రమణలు అధికంగా వున్నాయి. దుత్తలూరు మండలంలో 8754 ఎకరాల మేతపోరంబోకు భూమి వుండగా నందిపాడులో 200 ఎకరాలు, నర్రవాడలో 100 ఎకరాలు, ఎరుకొల్లులో 70ఎకరాలు, గొల్లపల్లిలో 30 ఎకరాలు, వరికుంటపాడులో 40 ఎకరాల వంతున ఆక్రమణకు గురయ్యాయి. కొండాపురం మండలంలో గమనిస్తే మొత్తం 1648 ఎకరాలకుగాను భీమవరప్పాడులో 90 ఎకరాలు, లింగన్నపాళెంలో 100 ఎకరాలు ఆక్రమణ చెరచిక్కాయి. అలాగే కలిగిరి మండలంలో నాగసముద్రం గ్రామంలో చాలావరకు భూమిని ఆక్రమించేసి ఇటుక బట్టీలు నిర్వహిస్తున్నారు. సీతారాంపురం మండలంలో 400 ఎకరాలు వుండగా మండల కేంద్రంలో 85 ఎకరాలు, చిన్ననాగం పల్లిలో 80 ఎకరాలు వుండగా పాలంగారి పల్లెలో 20 ఎకరాలు, బసినేనిపల్లిలో 90 ఎకరాలు, మారంరెడ్డిపల్లిలో 50 ఎకరాలు ఆక్రమణ చెరలో వున్నాయి. ఉదయగిరి మండలంలోని కృష్ణంపల్లి, జి.చెరువుపల్లి, శకునాలపల్లి, చౌడేపల్లి, వింజమూరులో మేత పోరంబోకు భూములు ఆక్రమణలకు గురైనా పట్టించుకునే అధికారి లేకుండా పోయారని పలువురు వాపోతున్నారు.

# అల్లూరు కాలేజి పూర్వ విద్యార్థుల సమావేశం!



పూర్వ విద్యార్థులతో జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు బీద రవిచంద్ర.

అల్లూరు రామకృష్ణా జూనియర్ కాలేజిలో 1984–86 మధ్య టెన్త్, ఇంటర్మీడియట్ చదివిన పూర్వ విద్యార్థుల సమావేశం 17వతేది ఇస్కపల్లిలోని బిఎంఆర్ హేచరీ ప్రాంగణంలో జరిగింది. వివిధ రంగాల్లో స్థిరపడ్డ వీరు తమవంతుగా గ్రామాభివృద్ధి, ప్రతిభ గల విద్యార్థులకు స్కాలర్‌షిప్పులతో పాటు పలు నిర్మాణాత్మక కార్యక్రమాలను చేయాలని తీర్మానించారు. ఈ కార్యక్రమాల సాధన కోసం ఒక సంఘంగా ఏర్పడ్డారు. దీనికి గౌరవాధ్యక్షునిగా తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, అధ్యక్షునిగా ఆల్తూరు జయకృష్ణారెడ్డి(నెల్లూరు రూరల్ ఎడిఇ)లను ఎన్నుకొన్నారు. ఉపాధ్యక్షులుగా సామంతుల రఘునాధరెడ్డి, కెవి నారాయణరెడ్డి, ఆర్గనైజింగ్ కార్యదర్శిగా డి.విష్ణువర్ధన్‌రెడ్డి, కార్యదర్శిగా డి.సాయిరామ్, కోశాధికారిగా అల్లూరు రహీం, సహాయ కార్యదర్శులుగా డాక్టర్ ఎ.శ్రీధర్‌రెడ్డి, బి.చంద్రశేఖర్ రెడ్డిలతోపాటు 15మంది కార్యవర్గ సభ్యులను ఎన్నుకొన్నారు. తదుపరి సమావేశంలో చదువు చెప్పిన గురువులను సన్మానించాలని, పాఠశాలలో పదవ తరగతి చదివి 30ఏళ్లు పూర్తయిన సందర్భంగా అందరు విద్యార్థులను పిలిచి సభ నిర్వహించాలని తీర్మానించారు.

# రైతులకు విరివిగా రుణాలు!



సమావేశంలో మాట్లాడుతున్న ధనుంజయరెడ్డి.

## సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు మెట్టుకూరు

రైతులకు విరివిగా రుణాలు అందించేందుకు కేంద్ర సహకారబ్యాంక్ ప్రత్యేక చర్యలు చేపడుతోందని ఆ బ్యాంక్ ఛైర్మన్ మెట్టుకూరు ధనుంజయరెడ్డి తెలిపారు. కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ పాలకవర్గ తొలి సమావేశం ఇటీవల జరిగింది. ఈ సందర్భంగా ధనుంజయరెడ్డి మాట్లాడుతూ బ్యాంక్ ఆర్థిక పరిపుష్టికి ప్రతిఒక్కరూ బాధ్యతాయుతంగా వ్యవహరించాలన్నారు. డిపాజిట్లు సేకరణను వేగవంతం చేయాలన్నారు. రైతులకు స్వల్పకాలిక, దీర్ఘకాలిక రుణాలు అందించేందుకు అన్ని చర్యలు తీసుకొంటున్నామని, రుణాలు పొందే రైతులు తిరిగి సక్రమంగా చెల్లింపులు జరిపితేనే రుణాలు ఇవ్వడానికి ఆస్కారం వుంటుందన్నారు. ఆప్కాబ్ నుండి 250 కోట్ల నిధులు తీసుకవచ్చేందుకు కృషి చేస్తున్నామన్నారు. బ్యాంక్ డైరెక్టర్లు వున్న సొసైటీల్లో కొత్త బ్యాంకులను ఏర్పాటు చేయనున్నట్లు తెలిపారు. వాణిజ్య బ్యాంకులకు ధీటుగా సహకారబ్యాంక్ సేవలను విస్తృత పరుస్తామన్నారు. రైతుల శ్రేయస్సును దృష్టిలో వుంచుకొని ప్రతిఒక్కరూ కష్టపడి పని చేయాలన్నారు.

# ప్రజల్లో చైతన్యం రావాలి!

## కావలి ఆర్డీఓ పిలుపు

ప్రజల్లో చైతన్యం వచ్చినపుడే రెవెన్యూ సదస్సులతో మంచి ఫలితాలు వస్తాయని కావలి ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి అన్నారు. బోగోలులో జరిగిన రెవెన్యూ సదస్సులో పాల్గొన్న ఆయన ప్రజా సమస్యలను పరిష్కరించేందుకు ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఈ సదస్సులను ప్రజలందరూ వినియోగించుకోవాలన్నారు. ప్రతి రైతు తమకు వుండే భూముల వివరాల దస్త్రాలను పరిశీలించి లోపాలు వుంటే తగిన ఆధారాలు చూపి సరిచేయించుకోవచ్చని చెప్పారు. పేదలకు నివేశన స్థలాలను పంపిణీ చేయాలని తహశీల్దార్‌కు సూచించారు. దళితవాడలో వర్షపునీరు నిల్వకుండా చూడాలని, స్మశానవాటికకు దారి చూపించాలని ప్రజలు కోరడంపై స్పందించిన ఆయన వెంటనే ఆ సమస్యలను పరిష్కరించాలని అధికారులను ఆదేశించారు. రెవెన్యూ సదస్సుకు హాజరైన ప్రజలు అధికారుల దృష్టికి తీసుకవచ్చిన వివిధ సమస్యలకు అప్పటికప్పుడు పరిష్కార మార్గం చూపేలా అధికారులు తగిన చర్యలు చేపట్టారు. ఈ సదస్సులో తహశీల్దార్ అంకయ్య, ఆర్‌ఐ వెంకటేశ్వర్లు, నాగులవరం సొసైటీ అధ్యక్షుడు వెంకటేశ్వర్లురెడ్డి, వివిధ గ్రామాల కార్యదర్శులు పాల్గొన్నారు.

# పిల్లలకు విటమిన్-ఎ ద్రవం పంపిణీ!

## చాలా రోజులకో మంచి పని

జిల్లా వైద్య ఆరోగ్య శాఖ చాలా సంవత్సరాల తర్వాత ఎ–విటమిన్ ద్రవం పంపిణీకి శ్రీకారం చుట్టింది. రాష్ట్ర కుటుంబ సంక్షేమ శాఖ కమిషనర్ పూనం మాలకొండయ్య పది సంవత్సరాలలోపు పిల్లలు దృష్టి లోపంతో బాధపడుతున్నారన్న విషయాన్ని గుర్తించారు. ఈ శాఖకు కమిషనర్‌గా వచ్చిన తర్వాత ఎ–విటమిన్ ద్రవం పంపిణీ చేయలేదన్న విషయాన్ని ఆమె గుర్తించారు. అంతే ఆఘమేఘాలపై ఆ శాఖ ఉన్నతాధికారులతో రెండు, మూడు దఫాలు సమీక్షా సమావేశాలు నిర్వహించి ఎ–విటమిన్ పంపిణీ చేయాలని ఆదేశాలు జారీ చేయడం జరిగింది. వైద్య ఆరోగ్య శాఖ ఆధ్వర్యంలో పల్స్‌పోలియో, ఫైలేరియా నియంత్రణ మాత్రలు పంపిణీ, మలేరియా వ్యాధుల నివారణపై విస్తృత ప్రచారం చేస్తుంటారు. ఈ ప్రచారంలో భాగంగానే దృష్టి లోపాన్ని నివారించేందుకు ఎ–విటమిన్ ద్రవం గురించి ప్రచారం చేయాల్సి వుండగా, ఆ దిశగా వైద్య ఆరోగ్య శాఖ అధికారులు ప్రచారం చేయడం లేదు. ప్రభుత్వ కార్యక్రమాల ప్రచారానికి సంబంధించి ఆ శాఖలో ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటుచేసి నిధులు కూడా విడుదల చేస్తుంది ప్రభుత్వం. నిధులైతే ఖర్చు చేస్తున్నట్లు లెక్కలు చూపుతున్నారే తప్ప ప్రచారం చేయడం గాలికొదిలేశారు. జిల్లాలో రెండు సంవత్సరాల నుంచి పది సంవత్సరాలలోపు వయసు కలిగిన చిన్నారులకు ఎ–విటమిన్ లోపం వల్ల రేచీకటి వస్తుందని వైద్య నిపుణులు చెబుతున్నారు. ఇటువంటివారు ప్లే క్లాస్ నుండి కంటి అద్దాలు వాడాల్సిన పరిస్థితి ఏర్పడింది. వైద్య ఆరోగ్య శాఖ కమిషనర్ ఆదేశాలతో జిల్లా అధికారులు పరుగులు తీసి ఎ–విటమిన్ ద్రవాన్ని గ్రామాల్లో పంపిణీ చేస్తున్నారు. ఈ నెల 18 నుంచి 23వ తేదీ వరకు అన్ని ప్రాథమిక, ఉప ఆరోగ్య కేంద్రాలు, అంగన్‌వాడీ కేంద్రాల్లో ఈ ద్రవం వేస్తున్నారు. ఈ కార్యక్రమంపై ముందుగా గ్రామీణ ప్రాంతాల్లో ప్రచారం నిర్వహించి ఆ తర్వాత ఇంటింటికి వెళ్లి పిల్లలకు ద్రవం వేయాలి. కానీ ఏఎన్‌ఎం సూపర్‌వైజర్లు గ్రామంలోని అంగన్‌వాడీ కేంద్రాలకే పరిమితమై ఆశా వర్కర్లు, అంగన్‌వాడీ వర్కర్ల ద్వారా పిల్లలను పిలిపించి ద్రవం వేస్తున్నారు. ఇలా చేయడం వల్ల పాఠశాలల్లో వున్న విద్యార్థులు నష్టపోతున్నారు. ఇప్పటికైనా అధికారులు ప్రత్యేక దృష్టి సారించి ఈ కార్యక్రమాన్ని విజయవంతం చేయడంతోపాటు తరచూ ఎ విటమిన్ ద్రవం అందిస్తే బాగుంటుంది.

## అవినీతి జమానా కావలి ఖజానా!

కావలి ఉపఖజానా కార్యాలయం అవినీతి నిలయంగా మారుతోంది. ప్రతి ఫైలుకు అడిగినంత ముట్టజెప్పందే బిల్లులు చేయడం లేదన్న ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. కావలి పరిధిలో గల వివిధ శాఖల ఉద్యోగస్తుల జీతాల బిల్లులు, ఇతరత్రా చెల్లింపులు అన్ని ఈ ఉపఖజానా కార్యాలయం నుంచే జరుగుతుంటాయి. ప్రతి పనికి ఒక రేటు నిర్ణయించి అది చేతిలో పడందే పనులు జరగకపోతుండడంతో ఇక్కడకు వచ్చే ఉద్యోగులు, ఉపాధ్యాయులు హడలిపోతున్నారు. ఖజానా కార్యాలయంలో ఏ బిల్లు కదలాలన్నా కార్యాలయ అధికారిని కలవాల్సిందేనట. సాధారణ జీతభత్యాల బిల్లులు, ఇంక్రిమెంట్లకు సంబంధించిన బిల్లులు మంజూరు కావాలంటే ఆ అధికారిని దర్శించుకొని ఆయనకు కమీషన్ ముట్ట జెప్పాల్సిందేనట. లేదంటే బిల్లు చెల్లింపులు జరగవని పలువురు ఉద్యోగులు, ఉపాధ్యాయులు వాపోతున్నారు. చివరకు ఉద్యోగులు, పెన్షనర్లు దురదృష్టవశాత్తు మరణించిన సందర్భంలో వారి దహన క్రియలకు ఇచ్చే బిల్లుల్లో సైతం వాటా చెల్లించనిదే మంజూరు కావడం లేదు. ఎవరైనా అవినీతిపై ప్రశ్నిస్తే మీకు దిక్కున్న చోట చెప్పుకోండి. నన్నేవరూ ఏమీ చేయలేరని బహిరంగంగా సవాల్ విసురుతుంటాడట. కావలి ఖజానాపై ఎసిబి దృష్టిసారిస్తే బాగుంటుంది.

## వవ్వేరు విఆర్వో లీలలు!

తండ్రి నుంచి సంక్రమించిన భూమిని అక్రమంగా మరొకరికి కట్టబెట్టేందుకు రెవెన్యూ అధికారులు ప్రయత్నిస్తున్నారని వవ్వేరుకు చెందిన గడ్డం శిరీష ఆరోపించారు. బుచ్చిరెడ్డిపాళెం మండలం వవ్వేరు గ్రామంలో తన తండ్రి పెంచలయ్య సర్వే నెంబర్ 1110–5, 4ఏ, 14, 2 నెంబర్లలో 1.15 ఎకరాల భూమి అనుభవదారుడిగా వున్నారని, ఆ భూమిని 2009లో తన పేరున రాసిచ్చారని చెప్పింది. అప్పట్నుంచి భూమి శిస్తు చెల్లిస్తున్నట్లు చెప్పారు. గ్రామానికి చెందిన రజోరియా అనే మహిళ తన తండ్రిని ఆమె భర్తని చెప్తూ భూమిని కాజేయాలని చూస్తోందన్నారు. ఆమెకు వవ్వేరు విఆర్ఓ రఘునందన్‌రెడ్డి సహకరిస్తూ, ఆడంగల్‌లో ఆమె పేరును అక్రమంగా చేర్చారని ఆరోపించింది. దీనిపై విఆర్ఓను ప్రశ్నిస్తే 50వేల డబ్బులిస్తే అడంగల్‌లో తమ పేరు చేరుస్తామని, ఇందులో తహశీల్దార్‌కు వాటా ఇవ్వాలని బహిరంగంగా వ్యాఖ్యానిస్తూ, దీనిపై కలెక్టర్‌కు చెప్పుకొన్నా నాకేం భయంలేదంటున్నారని వాపోయింది. ఉన్నతాధికారులు తనకు న్యాయం చేయాలని కోరింది.

# పేరుకే ప్రాథమిక ఆరోగ్య కేంద్రం!

## కలువాయిలో విధులకు డుమ్మా కొడుతున్న డాక్టర్, సిబ్బంది.



కలువాయి పిహెచ్‌సిని తనిఖీ చేస్తున్న డిఎంఅండ్‌హెచ్‌ఓ.

డాక్టర్ల రాక, సిబ్బంది అందుబాటులో వుండకపోవడంతో కలువాయి ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రజలకు ఉపయోగపడడం లేదు. అధికారులు పలు మార్లు తనిఖీలు జరిపినా, హెచ్చరికలు చేసినా వీరి తీరులో మార్పురాకపోవడంతో ఇక్కడికి రావాలంటేనే చుట్టు ప్రక్కల ప్రాంతాల వారు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. డాక్టరు విధులు ఎగ్గొట్టి ఇష్టానుసారంగా ప్రవర్తిస్తుండడంతో యాధారాజా తథా ప్రజ అన్నట్లు వుంది క్రిందిస్థాయి సిబ్బంది పరిస్థితి. ఆరోగ్య కేంద్రానికి వచ్చే రోగులకు వైద్యం అందించేందుకు ఎవరూ అందుబాటులో వుండడం లేదు. కాన్పులు, ఇతర సేవలను గాలికి వదిలేశారు. ఇటీవల డిఎంఅండ్‌హెచ్‌ఓ డాక్టర్ మాసిలామణి తనిఖీ జరపగా సిబ్బంది నిర్లక్ష్యం బయటపడింది. పద్ధతి మార్చుకోకపోతే ఉద్యోగాలు ఊడతాయని హెచ్చరించారు. అయినా సిబ్బందిలో మార్పులేదు. ఫార్మాసిస్టు ఎప్పుడు వస్తుందో ఎవరికి తెలీదు. ఆమె నుంచి వ్యాక్సిన్లు తీసుకొనేందుకు ఎఎన్‌ఎంలు చెట్లక్రిందే పడిగాపులు కాయాల్సి వస్తోంది. ఈ సమాచారం అందుకున్న జిల్లా ఇమ్యూనైజేషన్ అధికారి కలువాయి వచ్చి చూడగా డాక్టరు, ఫార్మాసిస్టు, సూపర్‌వైజరు, ఎల్‌డిసిలు ఎవరూ విధులకు రాకపోవడంతో వారికి రిజిష్టర్‌లో ఆబ్‌సెంట్ మార్కు చేశాడు. డిఎంహెచ్‌ఓకి చెప్పి మెమో ఇప్పిస్తామని హెచ్చరించి వెళ్లాడు. ప్రక్కరోజు నుంచి వీరి తీరు మామూలే. వెంకటగిరి, నెల్లూరు తదితర ప్రాంతాల నుంచి వచ్చేవీళ్లు ఎప్పుడో తీరిక దొరికినపుడు ఒకసారి వచ్చి ఖాళీగా వున్న రిజిష్టర్‌లో సంతకాలు చేసి వెళ్తుంటారట. దీనిపై ప్రశ్నిస్తే 8లక్షలు స్వాహా చేసిన డాక్టరే దర్జాగా తిరుగుతుంటే ఇక మాకేం అవుతుందని సమాధానం ఇస్తుండడంతో వీరి బరితెగింపు అర్థమవుతోంది. జిల్లా అధికారులు కఠినంగా వ్యవహరించి ఇక్కడి వైద్య సిబ్బందిని దారిలోకి తేవాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.



నెల్లూరు ఎసి స్టేడియంలో మహిళా వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో జరిగిన మహిళా దినోత్సవ సభలో మాట్లాడుతున్న సంఘం అధ్యక్షురాలు వి.రాధమ్మ. వేదికపై ఎస్.సుశీలారెడ్డి, వసుంధర, జానకీదేవి తదితరులు.

## గ్రావెల్ త్రవ్వకాలను అడ్డుకొన్న గ్రామస్తులు

దగదర్తి మండలం కౌరుగుంట గ్రామంలో అక్రమంగా నిర్వహిస్తున్న గ్రావెల్ త్రవ్వకాలను స్థానికులు అడ్డుకొన్నారు. కడపకు చెందిన ఒక కంపెనీ నిర్వహకులు ప్రభుత్వ అనుమతిచ్చిందని చెప్తూ ఎడాపెడా గ్రామంలో కొంతకాలంగా గ్రావెల్ త్రవ్వి తరలిస్తున్నారు. ఈ త్రవ్వకాలపై కావలి ఆర్‌డిఓకు, జిల్లా కలెక్టర్‌కు ఫిర్యాదు చేశారు గ్రామస్తులు. వీరి ఫిర్యాదుపై జిల్లా కలెక్టర్ విచారణ జరపమని ఆర్‌డిఓకు ఆదేశాలు జారీ చేసినప్పటికీ స్పందన లేకుండాపోయిందని స్థానికులు ఆగ్రహిస్తున్నారు. ఇటీవల గ్రావెల్ త్రవ్వకాలను అడ్డుకొనేందుకు సిద్ధమైన గ్రామ ప్రజలు త్రవ్వకాలు జరుపుతున్న ప్రాంతానికి వెళ్లి ఆందోళనకు దిగారు. దీంతో ఆ ప్రాంతంలో ఉద్రిక్తత నెలకొనింది. కంపెనీ నిర్వాహకులు మాత్రం ప్రభుత్వం ఇచ్చిన అనుమతులకు లోబడే త్రవ్వకాలు జరుపుతున్నామని చెప్పడడంతో ఈ విషయమై గ్రామంలో వివాదం నెలకొనింది.

● అల్లూరులో

# ట్రాఫిక్ అబందర!

## రోడ్ల విస్తరణ పని ఎప్పటికి పూర్తయ్యేనో?



కోట్ల రూపాయలు వెచ్చించి చేపట్టిన రోడ్డు పనులు నిలిచిపోవడంతో అల్లూరులో రాకపోకలకు తీవ్ర ఇబ్బందులు ఎదురౌతున్నాయి. ఈ ప్రాంతంలో ఇరుకుగా వుండే రోడ్డును వెడల్పు చేసి రెండు లైన్ల రహదారి నిర్మించేందుకు ప్రభుత్వం ఏడుకోట్ల రూపాయలు మంజూరు చేసింది. ఈ నిధులతో అల్లూరులో రోడ్డు పనులు ప్రారంభం అయ్యాయి. స్థానిక బిఎస్‌ఎన్‌ఎల్ కార్యాలయం నుంచి ఇస్కపల్లికి వెళ్లే తూములు వరకు రోడ్డు నిర్మించారు. పాత బస్టాండ్ నుంచి మసీదు వరకు నిర్మిస్తున్న రోడ్డు పనులే అర్థాంతరంగా నిలిచిపోయాయి. ప్రభుత్వం అందించే పరిహారం స్వల్పంగా వుందని, దానివలన తమకు నష్టమని న్యాయం చేయాలంటూ స్థానికులు కొందరు న్యాయస్థానాన్ని ఆశ్రయించడంతో వంద మీటర్ల మేర రోడ్డు పనులు నిలిచిపోయాయి. అటు రోడ్డు నిర్మాణం పూర్తికాకపోవడం, ఇటు ట్రాఫిక్ ఇబ్బందులు తలెత్తడంతో అల్లూరీయులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దీనికి తోడు ఆటోలు నడిపేవాళ్లు ఇష్టానుసారంగా రోడ్డుపై అడ్డదిడ్డంగా వాహనాలు నిలుపుదల చేస్తుండడంతో అస్తవ్యస్తంగా మారింది. ఎవరైనా ప్రశ్నిస్తే వారితో గొడవకు దిగడం, దాడులకు పాల్పడుతుండడంతో ఆటోవాళ్ల ఆగడాలకు ప్రజలు భయపడిపోతున్నారు. పోలీసులు ఇంత జరుగుతున్నా ఆటోలను నియంత్రించలేక పోవడం, ట్రాఫిక్ క్రమబద్ధీకరణకు చర్యలు చేపట్టక పోవడంతో విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

## ఉద్యోగాల పేరుతో టోపీ!

ఆకర్షణీయమైన జీతంతో ఉద్యోగాలు ఇప్పిస్తామంటూ పలువురి నుంచి డబ్బులు వసూలు చేసి దగా చేసిన ఉదంతం అల్లూరులో చోటు చేసుకొంది. గ్రామంలోని దళితవాడకు చెందిన ఒక మహిళ నెలకు 13,500 జీతంతో భోజన వసతి కల్పిస్తామని ఆసక్తి వున్నవారు సంప్రదించాలంటూ ప్రకటన ఇచ్చిందట. దీన్ని చూసి ఆశపడ్డ పలువురు నిరుద్యోగులు వారు తెలిపిన ఫోన్ నెంబర్‌లో సంప్రదించగా ఒక్కొక్కరి వద్ద నుంచి వేలాది రూపాయలు చెల్లించాలని తెలప

### అల్లూరులో ఉడాయించిన మహిళ

డంతో అధిక సంఖ్యాకులు ఉద్యోగాలు వస్తాయని, జీవితంలో కుదురుకోవచ్చని ఆశించి డబ్బులు చెల్లించారు. ఎంతకు ఉద్యోగాల్లో చేరమనిగాని, పలానా కంపెనీలో ఉద్యోగమని గాని ఎలాంటి సమాచారం రాకపోవడంతో డబ్బులు కట్టిన వారు ఆ మహిళను విచారించగా సరైన సమాధానం రాకపోవడంతో మోసపోయామని గ్రహించిన నిరుద్యోగులు ఆ మహిళపై పోలీసులకు ఫిర్యాదు చేశారు. అప్పటికే ఈ మహిళ గ్రామం వదలి వెళ్లిపోవడం విశేషం.

## పాసు పుస్తకాల కోసం నానాపాట్లు!

### కావలి డివిజన్‌లో రైతుల కష్టం తీరేదెట్లా?

పాస్‌పుస్తకాల కోసం రైతులు అధికారుల చుట్టూ కాళ్లరిగేలా తిరగాల్సిన పరిస్థితులు నెలకొంటున్నాయి కావలి డివిజన్‌లో. కొన్ని నెలలుగా డివిజన్‌లోని పలు మండలాల రైతులు రెవెన్యూ అధికారుల చుట్టూ ప్రదక్షిణలు చేసి అలసిపోతున్నారు. ఏదో ఒక కుంటిసాకులు చెప్పి తప్పించుకొంటున్న రెవెన్యూ సిబ్బంది తాము అడిగినంత ముట్టజెప్పిన వాళ్లకు మాత్రం త్వరితగతిన పాసు పుస్తకాలు అందచేస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. చాలా గ్రామాల్లో విఆర్‌ఓలు వీటి కోసం వచ్చే రైతుల వద్ద నుంచి ముక్కుపిండి మరీ వసూలు చేస్తున్నారట. ఒక్క జలదంకి మండలంలో పరిశీలించినట్లయితే వందల సంఖ్యలో దరఖాస్తులు పెండింగ్‌లో వున్నాయి. బోగోలు మండలంలోనూ ఇదే పరిస్థితి. విఆర్‌ఓలకు అడిగినంత ముట్టజెప్పకపోతే ఎన్నిసార్లు తిరిగినా పట్టించుకొనే నాథుడే లేకుండాపోయారని రైతులు వాపోతున్నారు. వీరితోపాటు ఆర్‌డిఓ కార్యాలయంలోని ఒక గుమస్తా తనకు ఇవ్వాల్సింది ఇవ్వకపోతే తీవ్ర ఇబ్బందులకు గురిచేస్తున్నారనే ఆరోపణలు వస్తున్నాయి. పాసుపుస్తకాలు తప్పనిసరి కావడంతో తిరిగి తిరిగి విసిగి వేశారి రెవెన్యూ సిబ్బంది చేయి తడపాల్సి వస్తోందని వివిధ మండలాల రైతులు వాపోతున్నారు.

● సత్వర న్యాయం

# అందించాలి!

### అధికారులకు ట్రైనీ ఐఎఫ్ఎస్ అధికారి సలహా

సత్వర న్యాయం అందించకపోతే సమాజం భ్రష్టుపట్టిపోతుందని ఐఎఫ్‌ఎస్ అధికారి బుడిగి శ్రీనివాసులరెడ్డి అన్నారు. శిక్షణలో భాగంగా ఆయన జిల్లాలోని ప్రభుత్వ శాఖల పనితీరును తెలుసుకొనేందుకు వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ, ప్రత్యేక కార్యక్రమంలో పాల్గొంటున్నారు. పొదలకూరు, గూడూరులో జరిగిన కార్యక్రమాల్లో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ పలు కార్యాలయాలలో పనులు జరగడం ఆలస్యమవుతున్నందున వివిధ సమస్యలపై వచ్చేవారు ఇబ్బందులు పడుతున్నారన్నారు. సిబ్బంది జాప్యం కారణంగానే ఇలాంటివి ఎదురౌతున్నాయన్నారు. పాఠశాలల్లో అమలవుతున్న మధ్యాహ్న భోజనపథకం సక్రమంగా అమలు కావడం లేదన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా పొదలకూరు జడ్పీ పాఠశాల విద్యార్థులతోను ముచ్చటించారు. గమ్యం లేని చదువు వ్యర్థం అన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని విద్యార్థులు చదువుకోవాలన్నారు. విద్యతోపాటు క్రమశిక్షణ, విధేయత ముఖ్యమన్నారు. లక్ష్యాన్ని నిర్దేశించుకొని దాన్ని చేరుకొనేందుకు కష్టపడాలని సూచించారు. ఈ కార్యక్రమంలో మండల అభివృద్ధి అధికారి శ్రీహరి, వెంకటేశ్వర్లు, బాలనాగమ్మ, మండల విద్యాధికారి అబ్దుల్ హమీద్ తదితరులు పాల్గొన్నారు.


వ్యాట్‌కు వ్యతిరేకంగా కావలి వస్త్ర వ్యాపారులు నిర్వహించిన నిరసన కార్యక్రమానికి మద్దతు తెలుపుతున్న కావలి వైఎస్‌ఆర్ కాంగ్రెస్ ఇన్‌ఛార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.

# వైద్యసేవలు గగన కుసుమం!

## కోవూరుపల్లి పిహెచ్‌సి తీరిది.

బోగోలు మండలం కోవూరుపల్లిలో గల ఆరోగ్య కేంద్రం ప్రజలకు అందుబాటులో వుండడం లేదు. మండల పరిధిలో గల 16 పంచాయితీలకు ఏకైక ఆరోగ్య కేంద్రమైన ఇక్కడ వైద్య సేవలు అందకపోతుండడంతో వివిధ వైద్య చికిత్సల కోసం వచ్చే మండల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. ఇక్కడ పని చేస్తున్న వైద్య సిబ్బంది ఎప్పుడూ అందుబాటులో వుండరు. అదేమని ప్రశ్నిస్తే మీటింగ్‌లకు వెళ్లారన్న సమాధానం సర్వసాధారణంగా వస్తుంటుందట. ఇక నర్సింగ్ సిబ్బంది వ్యవహారం సరేసరి. వైద్యం కోసం వచ్చే వారిని విసుక్కొంటుంటారట. మందు బిళ్లో, సూదిమందో వేసి పంపేస్తుంటారు తప్ప ఏ జబ్బుతో బాధపడుతున్నారు, ఎలాంటి ఆరోగ్య సమస్యలు ఎదుర్కొంటున్నారో తెలుసుకొనే తీరిక, ఓపిక ఇక్కడి సిబ్బందికి లేకపోవడంతో పేరుకే ఆరోగ్య కేంద్రం తప్ప ఎలాంటి ప్రయోజనం లేకుండాపోయింది. ఇలాంటి పరిస్థితుల్లో ఆరోగ్య కేంద్రానికి రావడం వృధా అని భావించి ప్రైవేట్ ఆస్పత్రులకు వెళ్లాల్సి వస్తోందని పలువురు వాపోతున్నారు. ఇప్పటికైనా ఆరోగ్య కేంద్రం సిబ్బందిని గాడిలో పెట్టి వైద్య సేవలు అందేలా చూడాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.




# పంటలు పండినాయా?

## బోగోలులో కలెక్టర్ ఆరా

బోగోలు మండలంలో రైతులు సాగుచేస్తున్న పంటలు, సాగునీటి సరఫరా తీరుతెన్నులను జిల్లా కలెక్టర్ శ్రీధర్ పరిశీలించారు. ఇటీవల మండలానికి వచ్చిన ఆయన ముంగమూరు పంచాయితీలో పంటలను చూడడమే గాక రైతులతో ముచ్చటించారు. సాగునీటి కోసం తపించిపోయిన రైతాంగం నీటి విడుదల చేశాక ఏ మేరకు ఉపయోగపెట్టుకొన్నారనే విషయమై స్వయంగా పరిశీలించారు. ఈ సందర్భంగా గ్రామానికి చెందిన ఏడవ తరగతి చదువుతున్న అంజలి అనే బాలికతో మాట్లాడారు. గతంలో కలెక్టర్ ఈ ప్రాంతంలో పర్యటించినపుడు ఆ బాలిక సాగునీరు అందక పంటలు ఎండిపోతుండడంపై కన్నీళ్లు పెట్టుకొనింది. ఆ సంఘటనను గుర్తుంచుకొన్న కలెక్టర్ శ్రీధర్ ఈ దఫా పర్యటనలో ఆ చిన్నారిని పిలిచి ఇప్పుడు నీరు అందుతున్నది కదా; పంటలకు నష్టం జరగలేదు కదా అని ప్రశ్నించడంతో ఆ అమ్మాయి సంతోషం వ్యక్తం చేసింది. దీనికి అంజలి స్పందిస్తూ మీరు సహాయం చేయడం వల్లే మాలాంటి రైతు కుటుంబాలు నష్టపోలేదని కృతజ్ఞతలు తెలిపింది. గ్రామానికి చెందిన మాజీ సర్పంచ్ వెంకటేశ్వర్లు, రామచంద్రారెడ్డి మాట్లాడుతూ సకాలంలో సాగునీరు అందకపోవడంతో ఎక్కువ శాతం తరకలు రావడంతో ధాన్యం రేటు పడిపోయిందని, కొనుగోలు చేయడం లేదని ఫిర్యాదు చేశారు. దీనిని పరిష్కరిస్తానన్న కలెక్టర్ ఆ తర్వాత జలదంకి, చిన్నక్రాక, జమ్మలపాళెం గ్రామాల్లో పర్యటించి పంటలను పరిశీలించారు.

# పరిష్కారానికి నోచని సమస్యలు!

## మళ్లీ రెవెన్యూ సదస్సులు మొదలు

మండలాల్లోని ప్రజల సమస్యలు పరిష్కరించేందుకు రెవెన్యూ సదస్సులు నిర్వహిస్తున్నారు అధికారులు. అయితే గతంలో నిర్వహించిన సదస్సుల్లో ప్రజలు వేలాదిగా తమ సమస్యలను అర్జీల రూపంలో తెలుపుకొన్నారు. వీటిని సత్వరం పరిష్కరిస్తామని ఈ కార్యక్రమానికి వచ్చిన అధికారులు ప్రకటించినప్పటికీ నెలలు గడిచినా పరిష్కారానికి నోచుకోలేదు. రెండు పర్యాయాలు నిర్వహించిన ఈ సదస్సుల్లో మొదటి సారి నిర్వహించినపుడు ప్రజల నుంచి తగినంత స్పందన లభించినప్పటికీ, రెండవ సారి జరిపిన కార్యక్రమానికి ప్రజల నుంచి స్పందన కొరవడింది. కొన్ని చోట్ల అర్జీలు ఇచ్చిన ప్రజలు సమస్యల పరిష్కారం కోసం రెవెన్యూ కార్యాలయాల చుట్టూ చెప్పులరిగేలా తిరగాల్సి వచ్చింది. ఇప్పటికీ అవి అలాగే వున్నాయి. ఈ పరిస్థితుల్లో మరో సారి జరుగుతున్న రెవెన్యూ సదస్సుల వల్ల ఎలాంటి ఉపయోగం వుండదని ప్రజలు పెదవి విరుస్తున్నారు.

# ఆటో డ్రైవర్లపై వేధింపులు ఆపండి!

## కష్టరోళ్లతిప్ప పోలీసులకు సిఐటీయూ డిమాండ్

ఆటో డ్రైవర్లను వేధింపులకు గురి చేయడాన్ని తక్షణం మానుకోవాలని సిఐటీయూ డిమాండ్ చేసింది. ఇటీవల బిట్రగుంట కెఎల్ నరసింహ భవన్‌లో ఆటోవర్కర్స్ యూనియన్ సమావేశం సిఐటీయూ ఆధ్వర్యంలో జరిగింది. ఈ సందర్భంగా సిఐటీయూ నేతలు మాట్లాడుతూ కారణం లేకుండా పనిగట్టుకొని పోలీసులు ఆటో డ్రైవర్లను వేధిస్తున్నారని ఇది మంచి పద్ధతి కాదన్నారు. ఆటో డ్రైవర్లు ప్రశ్నించినా సరైన సమాధానం చెప్పకుండా దురుసుగా ప్రవర్తిస్తున్నారని, తెల్లకాగితాలపై సంతకాలు చేయమని బలవంతం పెడుతున్నారని ఆరోపించారు. ఇదంతా చూస్తుంటే పోలీసులు చట్టాన్ని ఉల్లంఘిస్తున్నట్లుందని విమర్శించారు. ఎస్పీని కలిసి సమస్యను వారి దృష్టికి తీసుకొని పోతామని తెలిపారు. న్యాయం జరగకపోతే పోరాటానికి సిద్ధమని ప్రకటించారు. ఈ సమావేశంలో ఆటోవర్కర్స్ యూనియన్ జిల్లా కార్యదర్శి లక్ష్మీనరసయ్య, శ్రామిక మహిళా కన్వీనర్ రెహనాబేగం, చిన్న వెంకయ్య, నరహరి, రత్తయ్య తదితరులు పాల్గొన్నారు.

# నెల్లిమిట్టకండ్రిగలో మంచినీటికి కటకట!

## ఇబ్బంది పడుతున్న జనం

తోటపల్లి గూడూరు మండలంలోని పలుగ్రామాల్లో మంచినీటి ఎద్దడి నెలకొని వుంది. మోటార్లు చెడిపోయి, రక్షిత మంచినీటి పథకాలు ఉపయోగపడక, విద్యుత్ కోతలతో మంచినీటి సరఫరా జరుగక పలు గ్రామాల ప్రజలు దప్పిక తీర్చుకొనేందుకు అల్లాడిపోవాల్సి వస్తోంది. మరమ్మత్తులకు గురైన మోటార్లను సంబంధిత శాఖల అధికారులు పట్టించుకోకపోవడంతో మంచినీటి కోసం ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. నెల్లిమిట్ట కండ్రిగను పరిశీలిస్తే ఈ విషయం అర్థమవుతుంది. ఇక్కడి ప్రజలు తీవ్రమైన నీటి సమస్యను ఎదుర్కొంటున్నారు. గతంలో బాట గ్రామంలో వేసిన మోటారు మరమ్మత్తులకు గురై నీటి సరఫరా నిలిచిపోయింది. కొత్త మోటారు ఏర్పాటు చేసేందుకు ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు లక్షా డెబ్బైవేలతో ఎస్టిమేషను రూపొందించినా ఇంతవరకు పనులు ప్రారంభంకాలేదు. ఇటీవల తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతామోహన్ ఇక్కడి అధికారులతో సమీక్షా సమావేశం నిర్వహించిన సందర్భంలోనూ దీని విషయమై చర్చ జరిగినా ఉపయోగం లేకుండాపోయింది. దీంతో బాట, కోనేటిమిట్ట తదితర గ్రామాల ప్రజలు తాగునీటి కోసం కటకటలాడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి.

# భావోద్వేగాలకు సంకేతమైన రంగుల పండుగ హోలీ!

దేశంలో జరుపుకునే వివిధ పండుగలలో ప్రకృతి ఆరాధన మిళితమై వుంటుంది. అలాంటి పండుగలలో హోలీది ప్రత్యేక స్థానం. ప్రకృతి కాంతకు స్వాగతం చెబుతూ ఆనందోత్సాహాలతో జరుపుకొనే పండుగ హోలీ. దీనిని ఫాల్గుణోత్సవం అని కూడా అంటారు. ఫాల్గుణ మాసం పూర్ణిమ తిథినాడు ఈ పండుగను దేశ వ్యాప్తంగా జరుపుకొంటారు. ఈ పండుగ వసంత రుతువు ఆగమనాన్ని తెలియజేస్తుంది. చలికి, పొగమంచుకు వీడ్కోలు చెప్పి వెచ్చదనాన్ని తెచ్చే పండుగ ఇది. దసరా, దీపావళి, మాదిరిగానే దేశ వ్యాప్తంగా సంబరాలు జరుపుకోవడం ఈ పండుగ విశేషం.

ఫాల్గుణ మాసం... పౌర్ణమి సమయం... చల్లగాలులు వేడెక్కేవేళ లేలేత చిగుళ్లతో విరబూసిన పూరెమ్మలతో చెట్లన్నీ వసంతరాగాలతో పులకిస్తుండగా రంగుల వసంతాన్ని ఆనంద రాగాల్ని వెంటేసుకొని హోలీ వచ్చేస్తుంది. ఆనాడు చిన్న పెద్ద అంతా వీధుల్లో చేరి గులాల్ చల్లుకొంటారు. రంగు నీళ్లతో తడిచి ముద్దవుతూ కేరింతలతో తుళ్లిపడుతూ జరుపుకొనే ఆనంద హేలే ఈ హోలీ. దీనినే రంగ్ పంచమి అని, కాముని పున్నమి అని, హోళికా పూర్ణిమ అని, మహాఫాల్గుణి అని వ్యవహరిస్తారు. మొఘల్ పరిపాలనా కాలంలో హిందూ, ముస్లింలు మత సమైక్యతకు సంకేతంగా హోలీ పండుగను జరుపుకొనే వాళ్లని చరిత్రకారులు చెబుతున్నారు. 14 మన్వంతరాల్లో ఒకటైన బ్రహ్మ సావర్ణి మన్వంతరం ఈనాడే ప్రారంభమైందని పురాణాలు చెబుతున్నాయి.

ఈ పండుగకు సంబంధించి ఒక పురాణగాథ వుంది. పరమేశ్వరుడిని పార్వతి పతిగా చేయదలచిన మన్మథుడు తపోదీక్షలో వున్న ముక్కంటి ఆగ్రహజ్వాలకు దగ్ధం అవుతాడు. కానీ మన్మథ ప్రయత్నం వృథాపోదు. పరమేశ్వరుడు పార్వతిని వివాహమాడుతాడు. అందుకు సంకేతంగానే హోలీ పండుగ నాడు కామదహనం చేస్తారని అంటారు. అందుకే ఈ పండుగకు కామదహనం అనే పేరు వచ్చింది. ఇందులో ఒక అంతరార్థం దాగి వుంది. కామం అంటే కోరిక. జీవితాన్ని దుఃఖభరితం చేసే కోరికలను అగ్నికి ఆహుతి చేయాలన్నదే దీని భావం. అనంతమైన కోర్కెలు మన ఆనందాన్ని, మనశ్శాంతిని దహించి వేస్తాయి. అలాంటి కోరికలకు అడ్డుకట్టవేసి సంతృప్తికరంగా వుంటేనే జీవితం ఆనందమయం అవుతుందని, నిత్యవసంతం అవుతుందని చాటి చెప్పే పండుగే హోలీ.

రంగుల మయం అయిన ఈ ప్రపంచంలో మనిషిలో ఎన్నో భావాలు, భావోద్వేగాలు వుంటాయో ప్రకృతిలోనూ అంతకు మించిన వర్ణాలున్నాయి. గులాబి రంగు ప్రేమకు చిహ్నం. నీలం విస్తృతానికి గుర్తు. తెలుపు శాంతికి, కాషాయం త్యాగానికి, ఊదారంగు జ్ఞానానికి సంకేతం. పసుపు ఆనందానికి, ఎరుపు కోపానికి చిహ్నాలు. ప్రతి మనిషీ ఓ ఇంద్ర ధనుస్సు. అలాంటి భావోద్వేగాలకు సంకేతాలైన రంగుల పండుగే ఈ హోలీ.



సభలు - సమావేశాలు

# నెల్లూరులో యానాదుల రణభేరి!

**యానాదుల సంక్షేమ సంఘం ఆవిర్భవించి 20 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా కస్తూరిబా కళాక్షేత్రంలో నిర్వహించిన యానాదుల రణభేరి కార్యక్రమానికి వేలాదిగా యానాదులు తరలి వచ్చి తమ సమస్యలను ఎలుగెత్తి చాటారు.**

జిల్లాలోని యానాదులు తరలి వచ్చి నెల్లూరు నగరంలో మహా ప్రదర్శన నిర్వహించారు. ఈ నెల 17వ తేది యానాదుల సంక్షేమ సంఘం ఆవిర్భవించి 20 సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా కస్తూర్బా కళాక్షేత్రంలో మహాసభను నిర్వహించారు. సభకు ముందు నగరంలోని వీఆర్సీ మైదానం నుంచి కళాక్షేత్రం వరకు భారీ ర్యాలీ జరిగింది. జిల్లాలోని గూడూరు డివిజన్‌కు సంబంధించిన మండలాలు, నెల్లూరు డివిజన్‌లోని మండలాల యానాదులు అధికసంఖ్యలో తరలి వచ్చారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం యానాది, ఎరుకుల కులాలకు చెందిన వారిని గిరిజనులుగా పరిగణించాలని వుంది. అయితే యానాదులు మాత్రం గిరిజనులుగా పిలిపించుకునేందుకు నిరాకరిస్తున్నారు.

మహాసభ సందర్భంగా ఏర్పాటు చేసిన ఫ్లెక్సీలు, బ్యానర్లు, ప్లేకార్డుల్లో ఎక్కడ గిరిజనులు అనే పదం వినియోగించలేదు. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథులుగా 9మంది, విశిష్ట అతిథులు 16 మంది, ప్రత్యేక ఆహ్వానితులుగా 27 మందిని వేదికపైకి ఆహ్వానించారు. వేదికపైకి వచ్చిన వారిలో జిల్లా కలెక్టర్ శ్రీధర్, నెల్లూరు ఆర్డీఓ మాధవీలత మినహా మిగిలిన వారందరూ యానాది కులానికి చెందిన వారు. ముఖ్యఅతిథిగా హాజరైన కలెక్టర్ శ్రీధర్ యానాదుల జీవన స్థితిగతులపై సుదీర్ఘంగా ప్రసంగించారు. ఆత్మ గౌరవంతో జీవించడంతోపాటు ఆలోచనల్లో కూడా మార్పు రావాలని ఆకాంక్షించారు. ఆర్థికపరంగానూ, విద్యాపరంగానూ, వెనుకబడి వున్నారని, దీనిని అధిగమించేందుకు ప్రతిఒక్కరూ కృషి చేయాలని కోరారు. అర్థగంట సేపు ప్రసంగించిన కలెక్టర్ శ్రీశ్రీ రచించిన మహాప్రస్థానంలోని కొన్ని కవితలను ప్రస్తావించడం జరిగింది.

జిల్లాలోని వివిధ జలాశయాల్లో చేపలు పట్టుకునే హక్కు కల్పించడం జరుగుతుందని చెప్పారు. యానాదుల జీవితాల్లో వెలుగునింపేందుకు చేపట్టే పథకాల గురించి ఏ ఒక్కరూ కూడా వేదికపై ప్రస్తావించలేదు. వివిధ జిల్లాల నుంచి వచ్చిన యానాది సంక్షేమ సంఘం, ఉద్యోగ సంఘాల నేతలు ఎంతసేపటికి జిల్లాకలెక్టర్‌ను పొగిడేందుకు పోటీ పడ్డారు. గతంలో జిల్లా కలెక్టర్‌గా పని చేసిన ఎస్.ఆర్.శంకరన్‌తో ప్రస్తుత కలెక్టర్‌ను పోల్చుగా ఈ పొగడ్తలను మాత్రం ఆయన తిరస్కరించారు. దాదాపు 30 సంవత్సరాల క్రింత భూసంస్కరణల చట్టం అమల్లోకి వచ్చింది. దీంతో జిల్లాలో యానాదులకు 40 వేల ఎకరాలకు పైగా సిజెఎఫ్ఎస్ భూములు పంపిణీ చేయడం జరిగింది. వీటిలో ఎక్కువ శాతం భూములు ఇతరుల ఆధీనంలో నేటికి వున్నాయి. ఈ విషయం మండల తహశీల్దార్ దగ్గర నుంచి జిల్లా కలెక్టర్ వరకు తెలిసినా వీటిని తిరిగి స్వాధీనం చేసుకుని యానాదులకు అప్పగించేందుకు సాహసించలేకపోతున్నారు.

చేపలు పట్టుకునేందుకు వల, పట్టిన చేపలను విక్రయించుకునేందుకు సైకిళ్లు పంపిణీ చేస్తే యానాదుల జీవన విధానంలో ఎటువంటి మార్పు రాదన్న విషయం అధికారులు, పాలకులు గ్రహించాలి. యానాది కుల సంఘాల పేర్లతో చెలామణి అవుతున్న నేతలు మాత్రం అన్ని విధాలుగా అభివృద్ధి చెందుతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో యానాదులు ఒక్క సెంటు భూమిలేని వారు వేలాది మంది వున్నారు. వీరి హక్కులు గురించి పట్టించుకునే దిక్కులేదు. సభలు, సమావేశాలు ఏర్పాటు చేసి వాహనాలు ఏర్పాటు చేస్తే ఎంత దూరమైన వస్తారు. అంతే తప్ప సభ ఉద్దేశం, నాయకులు, అధికారులు ఏం చెప్పారన్న దానిపై అవగాహన వుండదు. మండల స్థాయిలో వున్న ప్రభుత్వ కార్యాలయాల గడప తొక్కని యానాదులు వున్నారంటే అందుకు ఆశ్చర్యపోకతప్పదు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వీరికి కేటాయించే నిధులు కూడా చాలా తక్కువే. కేవలం 10వేల రూపాయల లోపు పథకాలను మాత్రమే మంజూరు చేసే అవకాశం వుంటుంది. బ్యాంకులు వీరికి రుణాలు మంజూరు చేసే అవకాశం లేదు. ఈ వేదికపై ప్రసంగించిన వారిలో పలువురు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లో కీలక పదవులు నిర్వహిస్తున్న వారు, పదవీ విరమణ చేసిన వారున్నారు. ఈ కార్యక్రమంలో ఐటిడిఏ పిఓ వెంకటేశ్వర్లు, గూడూరు సబ్ కలెక్టర్ నివాస్, మురళీమోహన్, పొట్లూరు శ్రీనివాసులు, ఏకొల్లు వేణు, సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు. ఈ సభకు ఏ కారణం చేతనో తెలియదు గాని ప్రజాప్రతినిధులు, రాజకీయ పార్టీ నేతలను దూరంగా వుంచారు. యానాది సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షులు ఇండ్ల ఆంజనేయులు సభకు అధ్యక్షత వహించారు.



**కస్తూరిబా కళాక్షేత్రంలో జరిగిన యానాదుల రణభేరి సమావేశంలో మాట్లాడుతున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.**

# చిల్లర రాజకీయం చేస్తున్న రాజమోహన్‌రెడ్డి!

- **నెల్లూరు సిటీకి అబ్దుల్ అజీజ్, రూరల్‌కు ఆనం వెంకటరమణారెడ్డిల పేర్ల ప్రతిపాదన.**
- **పార్టీలో గందరగోళం మొదలు.**



నెల్లూరు జిల్లా వైఎస్ఆర్ కాంగ్రెస్ రాజకీయాలు ముదిరి పాకాన పడుతున్నాయి. ఆ పార్టీ నేతలు ఒక చిత్రమైన మానసిక వ్యాధికి లోనవుతున్నారు. ఎన్నికలు ఎప్పుడు జరిగినా గెలుపు తమదే కాబట్టి ఇప్పుడే అధికారంలోకి వచ్చేసిన భ్రమలో పడి పోతున్నారు. కేంద్రంలో ఏ మంత్రిత్వం తీసుకొంటే బాగుంటుందని ఒక స్థాయి నేతలు చర్చలు జరుపుతుంటే, రాష్ట్రంలో తాము మంత్రులుగా ఏమేమి పనులు చేయాలో ఇప్పటి నుంచే పథకాలు రచించుకొంటున్నారు మరొకస్థాయి నేతలు. టిక్కెట్ వస్తే చాలు, ఎమ్మెల్యే అయిపోయినట్లే అన్న ఆతృతలో మూడోస్థాయి నేతలు మదన పడుతున్నారు. ఈ అధికార భ్రమ అనే వ్యాధి చాలా ప్రమాదకరమైనది. కానీ అది ఒక మహమ్మారి వలె జగన్ పార్టీ నేతలందరినీ క్రమ్ముకొని వచ్చేస్తున్నది.

జిల్లాలో ఏ అసెంబ్లీ స్థానానికి ఎవరు అభ్యర్థి అన్న నిర్ణయం జగన్ ఎన్నడో చేసి పెట్టాడు. ఆయా నియోజకవర్గాలలో కష్టపడి పని చేసుకోమని జైలుకు వెళ్లక ముందే సూచన కూడా చేశాడు. కానీ అప్పటికీ ఇప్పటికీ జిల్లా రాజకీయాలలో వచ్చిన ప్రధాన మార్పు – మేకపాటి రాజమోహన్‌రెడ్డి ప్రమేయం బాగా పెరిగి పోవడం. ఉప ఎన్నికలలో గెలుపు తర్వాత పార్టీ అంటే నేను, నేనంటే పార్టీ అన్న ధోరణిలో పడి పోయాడాయన. తన మాట జగన్ వింటాడన్న నమ్మకం కాదు, విని తీరాలన్న పట్టుదల పెరిగి పోయింది. జగన్ మనస్తత్వం పూర్తిగా అర్థం చేసుకొంటే రాజమోహన్‌రెడ్డి ఈ తీరులో మనసును మలచుకొని వుండేవాడు కాదేమో. కానీ ఆయన ధోరణి ఎవరి మాటా విని పించుకొనే పరిస్థితిలో లేదు.

తాజాగా మేకపాటి రాజమోహన్‌రెడ్డి జిల్లా రాజకీయాలలో పెట్టిన తంపు – నెల్లూరు రూరల్, నెల్లూరు సిటీ స్థానాలలో తాను చెప్పిన అభ్యర్థులనే నిలబెట్టాలని పట్టుబట్టడం. నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చాలా కాలం నుంచి ఇళ్లు ఒళ్లు గుల్ల చేసుకొని పని చేస్తున్నాడు. వూరూరు తిరిగి మనిషి మనిషిని కలిసి తన స్థానాన్ని పదిలం చేసుకొన్నాడు. జగన్ కూడా అందుకు సహకారం అందించాడు. అనుమతి ఇచ్చాడు. అయితే ఏ కారణం వల్లనో శ్రీధర్‌రెడ్డి అంటే మేకపాటి సోదరులకు ఒళ్లుమంటగా తయారైంది. తమ శక్తి యుక్తులన్నీ వినియోగించి మరీ శ్రీధర్‌రెడ్డి ఎమ్మెల్యే కాకుండా చూడాలన్న పంతం పట్టి వున్నారు అన్నదమ్ములిద్దరూ. అందుకోసం ప్రత్యామ్నాయ అభ్యర్థిగా ఆనం వెంకటరమణారెడ్డిని ప్రతిపాదించారు. ఆనం భక్తవత్సలరెడ్డి ఇంటికి వెళ్లి మరీ నీ కుమారుడి రాజకీయ భవిష్యత్తును నేను కాపాడుతానని హామీ ఇచ్చి వచ్చాడట రాజమోహన్‌రెడ్డి. అయితే ఆనం వెంకటరమణారెడ్డి పట్ల జగన్ పార్టీలోని అగ్రనేతలెవరిలోనూ సానుకూలత లేదు. సదాభిప్రాయమూ లేదు. జనంలో పట్టు సంపాదించే చాకచక్యం లేని వాడని, నిలకడలేని వాడని వారి అభిప్రాయం. అందువల్ల రూరల్ స్థానంలో మార్పు కుదరదని రాజమోహన్‌రెడ్డికి గట్టిగానే సూచన చేశారు. కానీ ఆయన విన్పించుకోవడం లేదు.

ఇదిట్లా వుంటే తాజాగా నెల్లూరు సిటీ స్థానానికి రొయ్యల వ్యాపారి అజీజ్ పేరు ప్రతిపాదించాడు రాజమోహన్‌రెడ్డి. ఇది చాలా విచిత్రమైన ప్రతిపాదన. నెల్లూరు సిటీ స్థానంలో గత ఎన్నికలలో కేవలం 90 ఓట్ల తేడాతో ఓడిపోయాడు అనికుమార్‌యాదవ్. పైపెచ్చు ఆనం వెంకటరమణారెడ్డి వలెనే కాకుండా జనంలో పట్టు, పలుకుబడి నింపుకోగల్గిన చాకచక్యం కూడా వున్న యువకుడు. అన్నిటికీ మించి వెనుకబడిన తరగతులకు చెందిన

కొరవ 14వ పేజీలో

## పదవీ పరిరక్షణకు స్థానిక ఎన్నికల కవచం!

ఈ సమావేశాలను ఎట్లో ఒకట్లా గట్టెక్కించి, ఆ వెంటనే పంచాయితీలు, మునిసిపల్ ఎన్నికలు నిర్వహించాలనే పట్టుదలతో వున్నాడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి. నిజానికి ఆయనకు స్థానిక సంస్థల మీద ప్రేమ లేదు. ప్రజాస్వామ్య ప్రక్రియలు పాటించాలన్న ఆదర్శమూ లేదు. ఉన్నదల్లా తన పదవిని కాపాడుకోవడం ఎట్లా అన్న ఆందోళన మాత్రమే. అవిశ్వాసం గట్టెక్కినా, అధిష్టానం సమస్య వెన్నంటే వుంది. ఎప్పటి నుంచో కిరణ్‌ను గద్దె దించాలన్న ఆలోచన ఢిల్లీ పెద్దలకు వున్నా ఎప్పటికప్పుడు ఏదో ఒక అవాంతరం వచ్చి అది అమలుకు నోచుకోలేదు. ఇప్పుడు కూడా అధిష్టానానికి ఆ అవకాశం ఇవ్వకుండా స్థానిక సంస్థల ఎన్నికలను తన పదవికి రక్షణ కవచంగా వాడుకోవాలన్నది ముఖ్యమంత్రి పథకం. ఎన్నికల ప్రకటన వెలువడితే అందరి దృష్టి వాటి మీదకు వెళ్తుంది. కనీసం ఆరు నెలలపాటు ఆ ప్రక్రియ సొనసాగుతుంది. ఆ తర్వాత అసలు ఎన్నికలకు మరొక ఆరు నెలల గడువు మాత్రమే వుంటుంది. అందువల్ల ఆ స్వల్ప కాలానికి పదవీ మార్పులు తలపెట్టలేరు. అందుకోసమే స్థానిక సంస్థల ఎన్నికల అస్త్రాన్ని బయటకు తీశాడు.

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

తేది 23-3-2013 నుండి 29-3-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; కుంభంలో బుధుడు; మీనంలో రవి, కుజ, శుక్రులు; కర్కాటక, సింహ, కన్య, తులలలో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

తలపెట్టిన పనులలో చికాకులు లేదా వాయిదా పడటం వుంటుంది. వృత్తి, వ్యాపారాలలో సామాన్య ఆదాయం, భాగస్తులతో వివాదాలు ఏర్పడతాయి. ఉద్యోగులకు పై అధికారుల ఒత్తిడి, సఖ్యత సన్నగిల్లడం వుంటుంది. పిత్రు సంబంధ దాయాదులతో పోరు, శత్రుత్వం ఏర్పడవచ్చు. విద్యార్థులకు తమ చదువుపై శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు సామాన్య ఆదాయాలుంటాయి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ప్రతి పనిలో శ్రద్ధ, జాగ్రత్తలు అవసరం. తొందరపడి సాహస కార్యాలు చేపట్టకండి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో వారికి చక్కటి గుర్తింపు పొందగలరు. ఆర్థిక నిలకడ వుంటుంది. విద్యార్థులకు పరీక్షలలో ఏకాగ్రత అవసరం. వ్యవసాయదారులు లాభాలు పొందగలరు. కళా, క్రీడా రంగాలలోని వారికి తమ వృత్తిలో చక్కటి గుర్తింపు, శుభపరిణామ యోగ్యతలు పొందగలరు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

పనులలో కొంతమేర ఒత్తిడి తగ్గి, ప్రశాంతత ఏర్పడుతుంది. ఇంట్లో బాధ్యతలను గుర్తించి నెరవేర్చగలరు. గతంలో తాకట్టుపెట్టిన వస్తు, వాహన, భూ సంబంధితమైనవి విడిపించుకోగలరు. పాత బాకీల చింత తొలగుతుంది. ఉద్యోగుల ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాలలోని వారు ఆర్థికాభివృద్ధి సాధిస్తారు. విద్యార్థులు చదువులలో రాణించగలరు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. గృహనిర్మాణాది పనులకు ధనాన్ని ఖర్చు చేస్తారు. కుటుంబ ఆస్తి వివాదాలుంటాయి. వృత్తి, వ్యాపారాలలో ఆదాయం వున్నా నిందల పాలౌతారు. విద్యార్థులకు కఠిన పరీక్షలు తప్పవు. వ్యవసాయదారులకు ఆదాయ, వ్యయాలు సామాన్యం. వివాదాల జోలికి వెళ్లవద్దు. కళా, క్రీడా రంగాలలోని వారు తోటివారి సమస్యల పరిష్కారానికి తీవ్రంగా ప్రయత్నిస్తారు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

పనులన్నీ పూర్తవుతాయి. ఆకస్మిక ధనలాభం. దూర ప్రయాణాలు చేస్తారు. దైవదర్శనాలు, తీర్థ యాత్రలు చేయగలరు. వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాల వారికి రాబడికి మించిన ఖర్చులుంటాయి. సంతాన విషయంలో బాధ్యతలు మరువవద్దు. బంధుమిత్రుల సహాయంతో కుటుంబ సమస్యలు పరిష్కారం చేయగలరు. నూతన పరిచయాలతో లాభాలు. విద్యార్థుల విద్యావికాసాలు వికసిస్తాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

పనులలో ఆటంకాలు కలుగకుండా సమయస్ఫూర్తితో పూర్తి చేస్తారు. మీ మాటకు ఇంటా బయట విలువ, ఆదరణలు లభిస్తాయి. కుటుంబ, ఉద్యోగ బాధ్యతలు గుర్తిస్తారు. ఇంట్లో శ్రీమతితో వివాదాలు చేయకండి, మాటలు జాగ్రత్తగా వాడండి. వ్యవసాయదారులు అధిక శ్రమ వల్ల శరీరారోగ్యంలో తేడాలుంటాయి. రాజకీయులు వ్యవహారాలు నడుపునప్పుడు మధుర వచనాలు పలుకుట మంచిది.

## పంచాంగం

| | |
|---|---|
| 24తేది | శ్రీనారసింహ ద్వాదశి. |
| 25తేది | కామ దహనం. |
| 27తేది | హోలీ పండుగ, స్వామి అయ్యప్ప జయంతి. |
| 28తేది | వసంతోత్సవం. చూత కుసుమ భక్షణం. |
| 29తేది | గుడ్ ఫ్రైడే. |

### శుభ ముహూర్తాలు

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

**ఫాల్గుణ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 23 | శని | ఏకాదశి | సా | 05.14 గం.ల.వ |
| 24 | ఆది | ద్వాదశి | సా | 05.37 గం.ల.వ |
| 25 | సోమ | త్రయోదశి | సా | 05.19 గం.ల.వ |
| 26 | మంగళ | చతుర్దశి | సా | 04.23 గం.ల.వ |
| 27 | బుధ | పౌర్ణమి | సా | 02.55 గం.ల.వ |

**ఫాల్గుణ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 28 | గురు | పాడ్యమి | ప | 01.30 గం.ల.వ |
| 29 | శుక్ర | విదియ | ప | 10.58 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికాదాయం బాగుంటుంది. అన్యస్త్రీ వల్ల మానసికంగా, ఆర్థికంగా నష్టం చవిచూస్తారు. మానసిక వ్యధ, అనవసరపు త్రిప్పట. అయితే పిల్లల భవిష్యత్తు ఆనందాన్నిస్తుంది. సోదర, సోదరీమణుల మధ్య సఖ్యత బాగుంటుంది. విద్యార్థులు తమ పరీక్షలు బాగా వ్రాయగలరు. వ్యవసాయదారులకు ఖర్చులున్నా ఆదాయం వుంటుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

తలపెట్టిన పనులలో ఆర్థిక సంబంధ పనులు పూర్తవుతాయి. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలోని వారు కొంతకాలం కుటుంబానికి దూరంగా వుండగలరు. రావలసిన బాకీలు సకాలంలో అందుతాయి. వృత్తి, వ్యాపారాలలో మిశ్రమ స్పందన వుంటుంది. వ్యవసాయదారులకు ఉమ్మడి వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయులు పై, క్రింది వర్గాలతో మృదు సంభాషణ చేయడం మంచిది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పనులు సకాలంలో పూర్తవుతాయి. పాత బాకీలు వసూలౌతాయి. రుణ విముక్తులు కాగలరు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థిక వృద్ధి. చేసే ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. అనుకోని బాధ్యతలు నెత్తిన వేసుకొంటారు. దూరదృష్టితో చేపట్టిన పనులలో విజయం. విదేశాలకు వెళ్లేవారి ప్రయత్నాలు నిదానంగా పూర్తవుతాయి. వ్యవసాయదారులకు అవసరానికి డబ్బు చేతికందుతుంది.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

వృత్తి, వ్యాపారులు ఆర్థిక అసమానతలు ఎదుర్కోగలరు. వ్యాపారంలో స్తబ్దత వుంటుంది. ఉద్యోగులకు శుభపరిణామాలుంటాయి. అన్ని రంగాల వారికి ధనాదాయం బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం, కళత్ర ఆరోగ్యమందు పురోగతి కన్పిస్తుంది. నూతన స్త్రీ పరిచయాలుంటాయి. విద్యార్థులు బాగా చదివి ఉత్తీర్ణత సాధిస్తారు. వ్యవసాయదారులకు కష్టానికి తగ్గ ఫలితముంటుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

నూతన కార్యక్రమాల పట్ల అంకితభావంతో వుంటారు. పలుకుబడి కల్గిన వ్యక్తులతో పరిచయ లాభాలుంటాయి. అన్ని రంగాలవారూ ఆర్థికలాభాలతో ముందుకు సాగుతారు. అయితే వృత్తి, వ్యాపారాలలో ఇక్కట్లు తప్పకపోవచ్చు. విద్యార్థులు ధైర్యంతో ముందుకు సాగాలి. వ్యవసాయదారులు ఒడిదుడుకులతో సతమతమౌతారు. జాగ్రత్తలవసరం. కళా, క్రీడారంగాలలోని వారు ఆర్థికంగా పుంజుకుంటారు.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

నూతన కార్యక్రమాలకై చేసే ఆలోచనలు ముందుకు సాగుతాయి. ఆర్థిక, సాంఘిక జయం లభిస్తుంది. కళత్రం వల్ల ఇబ్బందులు, చికాకులు. వృత్తి, వ్యాపారాలు సామాన్యంగా వుండి ఆందోళన కల్గిస్తాయి. ధన నష్టం వుంటుంది. అయితే భూసంబంధిత వ్యవహారాలు రాణిస్తాయి. వ్యవసాయదారులకు లాభాల పంటగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోనివారు తమ పనులు వేగవంతం చేస్తారు.

# యంత్రం పరిష్కరించని సమస్య అంటూ వుండదు!

ఎన్.సాయిభాస్కర్‌రెడ్డి — తిరువూరు

* *యంత్ర ప్రతిష్ట తర్వాత చాలా సమస్యలు పరిష్కరించబడ్డాయి.*

ఓంకార స్వరూపమైన యంత్రం పరిష్కరించని సమస్య అంటూ వుండదు. పిల్లల వివాహాలు కుదరటం నాకూ సంతోషం వేసింది. వారికి నా ఆశీర్వాదాలు.

ఎన్.శ్రీధర్‌శర్మ — చిత్తూరు

* *ఆలయ నిర్మాణం ప్రారంభించాము. అంతకు క్రితం పాత ఆలయపు, పునాదుల్ని పూర్తిగా తీసివేశాము.*

అంత మాత్రంతో సరిపోదు. ఆలయ ప్రాంగణమంతా నాలుగు అడుగుల పాత మట్టిన తీసివేసి, క్రొత్త మట్టితో నింపాలి. నేలలో వున్న శిలలు, ప్రాచీన శిల్ప శిథిలాలను తీసివేయాలి. ఇతరత్రా ఆగమశాస్త్ర విధి విధానాల్ని పాటించాలి.

బైరాగి అనంతకృష్ణ — రాజమండ్రి

* *ఆయాన్ని గురించి వివరిస్తారా?*

స్థలం పొడవు వెడల్పుల్ని, తొమ్మిది సంఖ్యచే గుణించి ఎనిమిదిచే భాగిస్తే వచ్చే సంఖ్య ఆయం. అవి ధ్వజ, ధూమ్ర, గజ, కాకాది ఆయాలు.

కె.సుబ్బరామయ్య — వనంతోపు

* *యంత్రాల్ని ఎట్లా నిర్ణయిస్తారు?*

ఇంటి దిక్కు అందులోని దోషాల్ని, గృహస్తు సమస్యలు, అతని శత్రురాశులు వీటన్నింటినీ లెక్కించి యంత్రాన్ని నిర్ణయిస్తాము. అంగట్లో యంత్రాలు కొనడం నిష్ప్రయోజనం.

డి.వి.ప్రసాద్ — గూడూరు

* *ఆశ్లేష కన్యను వివాహమాడవచ్చా?*

రాక్షసగణం, జలతత్వం, తీక్షణత్వం, బుధాధిపత్యం లక్షణాలు, మాటతీరు, కుటుంబ పరిస్థితి, సంస్కారం వంటి లక్షణాలను బట్టి వివాహం చేసుకోవచ్చు.

ఎన్.అనుపమ — నాయుడుపేట

* *కేతువు ఉండటం మంచిదేనా?*

వృశ్చిక, ధనస్సులు భాగ్యభావములైె, అందులో ఉండే కేతువు శుభఫలదాత అవుతాడు.

ఆరవీటి కుసుమాంబ — కడప

* *'కాకా'యంలో ఏ గది వస్తుంది? ఎలా ఉపయోగించాలి?*

ఆయ విభాగంలో చివరిది కాకాయం. ఇది 'పూజగది'కి ఉపయోగిస్తారు.

టివిఆర్ — కావలి

* *నా జాతక దోషం వుందని వారు నన్ను మా యింటికి పంపించేశారు.*

ఇది దయనీయమైన స్త్రీ వివక్ష – వారి దుర్బుద్దిని, దుష్ట పన్నాగాలను కప్పి పుచ్చుకోడానికి శాస్త్రంపై నెపం వేస్తున్నారు. మీరు మహిళా పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు దాఖలు చెయ్యడం మంచిది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

డాక్టర్ దేవదాసు జాన్సన్ — హైదరాబాద్

* *జ్యోతిషంలో 'ప్రశ్న' వున్నదా?*

శాస్త్రంలో ప్రశ్న తంత్ర వున్నది. ఈ అంశంపై సివి.రామన్ కృషి చేశారు. అయితే 'ప్రశ్న' 'ప్రమాణ మంజరి' గణింపులపై ఆధారపడి వుంటుంది. వీధుల్లో ప్రశ్న చెప్పేవాళ్లకు అసలు శాస్త్రమే తెలియదని పరిశోధకుల ఉద్దేశం.

డాక్టర్ బెన్నిషా బేగం — హైదరాబాద్

* *'నాసా' ఈ మధ్య ప్రకటనలు జ్యోతిష శాస్త్రాన్ని గురించి నిజమేనా?*

ఖగోళ, విమానయాన, జ్యోతిష సిద్ధాంతాలలో భారతీయ శాస్త్రాలు అత్యున్నత ప్రమాణాలు కలిగి వున్నాయని ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త డాక్టర్ బెంజమన్ ఉల్లేఖించారు. ఈ విషయాలు నిజంగానే ప్రకటించారు.

డాక్టర్ కైలాసనాథ్ శర్మ — హైదరాబాద్

* *మత్స్య పురాణాన్ని గురించి చెప్పండి?*

మత్స్య పురాణంలో వాస్తు శాస్త్రవేత్తల వివరాలున్నాయి. వారిలో భృగువు, అత్రి, వశిష్ట, విశ్వకర్మలు వాస్తు శాస్త్ర సృజనకారులుగా అందులో పేర్కొనబడింది.

డి.సుబ్రహ్మణ్యశాస్త్రి — సిద్ధవరం

* *శాస్త్ర ప్రకారం ఏ కార్తెల్లో తుఫానులు వస్తాయి. వాటి తేదీలు ఏవి?*

స్వాతి(మంగళ), విశాఖ(మంగళ) ప్రవేశ కాలాల్లో(అక్టోబరు ఇరవై మూడు, నవంబరు ఆరు తేదీలు) తుఫానులు వచ్చే సమయాలని పంచాంగాలు చెబుతున్నాయి.

**● తూతూమంత్రంగా**

# రెవిన్యూ సదస్సులు!

> జిల్లాలో ఈ నెల 12వ తేదీ నుంచి జరుగుతున్న రెవిన్యూ సదస్సులు క్రమబద్ధంగా జరగడం లేదు. ప్రతి ఏడాది నిర్వహిస్తున్న ఈ సదస్సుల మూలంగా గ్రామీణ ప్రాంత రైతులకు ఒనగూడిన ప్రయోజనం ఏమిటో అర్థం కావడం లేదు



రెవిన్యూ సదస్సులో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్.

జిల్లాలో ఈనెల 12వతేదీ నుంచి ప్రారంభమైన రెవెన్యూ సదస్సులు తూతూమంత్రంగా కొనసాగుతున్నాయి. రాష్ట్రప్రభుత్వం రైతు సదస్సులను ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించాలని ఆదేశించింది. ప్రభుత్వ ఆదేశానుసారం సదస్సులు నిర్వహించాల్సి రావడంతో అధికారులు ముందుకు కదలక తప్పడం లేదు. ప్రధానంగా భూసమస్యలు, వివాదాలు పరిష్కరించాలన్నదే రెవెన్యూ సదస్సుల ముఖ్య ఉద్దేశం. రాష్ట్రవ్యాప్తంగా వీటిని నిర్వహించేందుకు నెల రోజుల క్రితమే ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు అవసరమైన ముందస్తు ప్రణాళికను అధికారులు రూపొందించుకొని ఆ దిశగా ఏర్పాట్లు చేసుకోవాలి. కాని మండలస్థాయిలో తహశీల్దార్ కార్యాలయ సిబ్బంది ప్రణాళికాబద్ధంగా సదస్సులు నిర్వహించడం లేదు. చిన్న గ్రామాల్లో ఒక పూట, పెద్ద గ్రామాల్లో ఒకరోజు ఎస్సీ, ఎస్టీ కాలనీలో నిర్వహించాలి.

ఏ గ్రామాల్లో ఏ రోజు సదస్సులు ఏర్పాటు చేయబోతున్నారో ఆ గ్రామాలకు సంబంధించిన పూర్తి వివరాలతో అధికార యంత్రాంగం వెళ్లాలి. ముందుగా గ్రామ సహాయకుల ద్వారా గ్రామాల్లో ప్రచారం నిర్వహించి రైతులను సదస్సుకు రప్పించాలి. సదస్సు నిర్వహించే గ్రామంలో రైతులు ఎదుర్కొంటున్న సమస్యలను తెలుసుకొని వీలైనంతవరకు అక్కడే పరిష్కరించేందుకు చొరవ చూపాలి. గతంలో భూవివాదాలకు సమస్యలకు సంబంధించి రైతులు సమర్పించిన వినతి పత్రాలపై చర్యలు తీసుకోవాలి. పట్టాదారు పాస్‌బుక్‌లకు దరఖాస్తు చేసుకుంటే వాటిని మంజూరు చేసి సదస్సు సందర్భంగా రైతులకు అందించాలి. గ్రామ రెవెన్యూ అధికారి రైతుల భూముల సమాచారం అందుబాటులో వుంచుకోవాలి. వీటి నిర్వహణకు ప్రభుత్వం నిధులు విడుదల చేసిందో లేదో తెలియదు కాని వీఆర్వోల జేబులకు మాత్రం చిల్లిపడుతోంది.

కొందరు వీఆర్వోలు రెండు, మూడు గ్రామాలకు ఇన్‌ఛార్జీలుగా వ్యవహరిస్తున్నారు. వీరి పరిధిలోని గ్రామాల్లో సదస్సుల ఏర్పాటు కోసం రేషన్‌షాపు డీలర్లు కొంత నగదును సమకూర్చాలని అధికారుల ఆదేశాలంటూ డిమాండ్ చేస్తున్నట్లు తెలిసింది. రెవెన్యూ అధికారులతో రేషన్‌షాపు డీలర్లకు నిత్యం పని వుండడంతో తప్పనిసరి పరిస్థితుల్లో ఎంతో కొంత నగదు అందిస్తున్నట్లు సమాచారం. ఎటువంటి హంగూ, ఆర్భాటం లేకుండా సదస్సుల్లో నిర్వహించాలని జిల్లా అధికారులు కోరినప్పటికీ కొన్ని గ్రామాల్లో రాజకీయ వేదికలుగా మార్చేస్తున్నారు. ప్రభుత్వ భూముల వివరాలపై దృష్టి సారించడం లేదు. ప్రభుత్వ భూములు అన్యాక్రాంతమౌతున్నా పట్టించుకునే వారు లేకుండా పోయారు.

తహశీల్దార్ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న రెవెన్యూ సదస్సులను జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్, ఆర్డీఓలు పర్యవేక్షించాల్సి వున్నా ఎందువల్లనో వారు వీటిపై పెద్దగా దృష్టిసారించినట్లు కనిపించడం లేదు. ప్రతి సంవత్సరం రాష్ట్రప్రభుత్వం రెవెన్యూ సదస్సులు వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో రైతు సదస్సులు ఏర్పాటు చేస్తూనే వుంది. వీటి నిర్వహణ వల్ల ఏమేరకు రైతులు ప్రయోజనం పొందారో అధికారులకే తెలియాలి. మొత్తం మీద రెవెన్యూ సదస్సుల పేరుతో నెలరోజుల పాటు అధికారులు కార్యాలయాలకు వెళ్లకుండా క్యాంపులకే పరిమితమై పోయే అవకాశం వుంది.

రెవెన్యూ సదస్సుల్లో తహశీల్దార్, ఆర్ఐ, సర్వేయర్, వ్యవసాయశాఖ, దేవాదాయ శాఖ, ఐకేపి, సిబ్బంది పంచాయితీ కార్యదర్శులు తప్పనిసరిగా పాల్గొనాలని రెవెన్యూశాఖ మంత్రి రఘువీరారెడ్డి ఆదేశించారు. మరోప్రక్క మే నెలలో స్థానిక సంస్థల ఎన్నికలు జరుగనున్న తరుణంలో ఓటరు జాబితా సవరణలు, నమోదు కార్యక్రమాన్ని వేగవంతం చేయాలని ఎన్నికల సంఘం ఇప్పటికే ఆదేశించింది. ఈ ప్రక్రియను రెవెన్యూ శాఖ ఆధ్వర్యంలో జరగాలి. రెవెన్యూ సదస్సుల నిర్వహణలో అధికారులు నిమగ్నమవ్వడంతో ఓటరు నమోదు, సవరణల ప్రక్రియకు కొంతమేర బ్రేకు పడింది.

# గుండెల్లో గోదారి పర్వాలేదు!



✍ అల్లూరు రహీం

నటుడు మోహన్‌బాబు కుమార్తె మంచు లక్ష్మీప్రసన్న అమెరికాలో నట శిక్షణ తీసుకున్న యువతి. చిత్ర పరిశ్రమలో కాలిడను అనగనగా ఓ ధీరుడు, కడలి చిత్రాలతో ప్రయత్నం చేసింది. అనగనగా ఓ ధీరుడు చిత్రంలో మాంత్రికురాలు ఐరేంద్రి పాత్రలో అదరగొట్టిన ఆమెను కడలి చిత్రం నిరుత్సాహ పరిచింది. ఈటీవీలో 'లక్ష్మీ టాక్ షో' కార్యక్రమంలో వివిఐపిలను ఇంటర్వ్యూలు చేసింది. అయినా ఆమెను ఏదో వెలితి పట్టి పీడించేది. దాన్ని వదిలించుకోను మంచు ఎంటర్‌టైన్‌మెంట్ పతాకంపై గుండెల్లో గోదారి చిత్రాన్ని నిర్మించింది. 1980 దశకంలో గోదావరి నదికి వచ్చిన వరద ఈ చిత్రానికి బ్యాక్‌డ్రాప్. అంతర్జాతీయ మహిళా దినోత్సవం రోజు విడుదలైన ఈ చిత్రంలో రెండు అందమైన ప్రేమకథలున్నాయి. ఇద్దరు యువతులు తమ జీవితాల్లో నిలదొక్కుకోను చేసిన పోరాటం, అణచివేతలు హృదయాన్ని కట్టి పడేస్తాయి. లక్ష్మీప్రసన్నకు తనకున్న గ్లామర్ ఏపాటిదో తెలుసు. అందుకే గుండెల్లో గోదారి సినిమాకు వచ్చిన యువకులను కట్టిపడేయను తాప్సిని రంగంలోకి దింపింది. ఈ సినిమాలో ఆమెది చాలా బోల్డ్ పాత్ర. మాటలు, చేష్టలతో తిక్క పుట్టించేస్తుంది. దీంతో బుద్ధిమంతుడైన హీరో కూడా ఆగలేక ఆబగా ఆమె మీద పడిపోతాడు. అయినా ఆమె నోటికి తాళం పడదు. మా నాన్నపై కసి నాపై చూపించావా అని అతడ్ని బాగా రెచ్చ గొడుతుంది. మాటలు తక్కువగా మాట్లాడేవారు పని ఎక్కువ చేస్తారంటుంది. మనసు కోరినవాడితో సంగమానికి పూలపాన్పులా సహకరిస్తుంది. మళయాళ సి-గ్రేడు సినిమాను తలపించేలా ఉండే ఈ సన్నివేశాలను కుటుంబసమేతంగా సినిమా చూడను వెళ్లిన ప్రేక్షకులు ఇబ్బంది పడతారు.




వీటికితోడు ముమైత్‌ఖాన్, మరో కన్నడ వ్యాంప్‌ల ఐటమ్ పాటలు చిత్రం చూసే వారిలో ఉద్రేకాన్ని పెంచేస్తాయి. వీటిమాటున గోదావరి వరద, మత్స్యకారుల జీవిత వ్యథలను చూడను ప్రేక్షకులు పెద్దగా ఇబ్బంది పడరు. పాత తరహా సంగీతానికి పెద్దపీట వేస్తూ ఇళయరాజా ఈ చిత్రానికి కూర్చిన సంగీతం, బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ వినసొంపుగా ఉంది. 80వ దశకం తరహా సంగీతంతో గుండెల్లో గోదారి, జల్లుమంది, వెచ్చానీ వయస్సు, ఎక్కడుంది నా కోడి చరణాలతో సాగే పాటల చిత్రీకరణ, స్క్రీన్‌ప్లే, మాటలకు తోడుగా తన దర్శక ప్రతిభను జోడించి కుమార్ నాగేంద్ర ఈ చిత్రాన్ని లాగించేశాడు. దర్శకునికి సమాజంలోని పలు రుగ్మతలపై మంచి అవగాహన ఉన్నట్లుంది. గ్రామీణ ప్రాంతాల్లో కొందరు మహిళలు కొనసాగించే అక్రమ సంబంధాలు, చూస్తూ ఊరుకునే అసమర్థ భర్తలు, చూడలేక కుళ్లిపోయే బిడ్డల భావావేశాన్ని చిత్రంలో బహుబాగా చిత్రీకరించాడు. గోదావరి నది సొగసు ముందు గ్లామర్ హీరోయిన్లు దిగదుడుపు అన్నట్లు పళనికుమార్ చూపిన కెమెరా పనితనాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించాల్సిందే.

చిత్ర కథలోనికి వెళ్తే గోదావరి నదీ తీరంలోని ఓ మత్స్యకార ముంపు గ్రామంలో మల్లి (ఆది), చిత్ర(లక్ష్మీప్రసన్న) పెళ్లిపీటల మీద కూర్చుని ఉండగా సరళ(తాప్సి) మల్లికి ఓ యనామిల్ ఉంగరం కానుకగా చదివిస్తుంది. దొరబాబు(రవిబాబు) చిత్రకు బంగారు చైన్ చదివించడంతో గ్రామంలో వీరెందుకు వచ్చి ఈ కానుకలిచ్చారన్న దానిపై చర్చ మొదలవుతుంది. ఇంతలో గోదావరి నదికి గతంలో ఎన్నడూలేనట్లుగా ఉధృత స్థాయిలో వరద రానున్న దృష్ట్యా గ్రామాన్ని వీడి పొమ్మని పోలీసులు జీపులో వచ్చి హెచ్చరికలు చేస్తారు. ఇంతలోనే తీవ్ర వరద వచ్చేస్తుంది. నూతన దంపతులు దాన్ని తప్పించుకొనే యత్నంలో గడ్డి వామిని ఎక్కుతారు. వరద గోదారిలో తమ గుండెల్లో నిక్షిప్తమైన ప్రేమకథలు చెప్పుకొంటారు. ఉంగరం కానుకగా ఇచ్చిన సరళ తాను చేపలు పట్టేందుకు నావ అద్దెకు ఇచ్చే పెదకాపు కుమార్తె అని మల్లి చెబుతాడు. ఆమె తన జీవితంతో ఆడుకొని శీలభ్రష్టుడ్ని చేసిన వైనం వివరిస్తాడు. తన జీవితంలోకి వచ్చిన ముగ్గురు మగాళ్లు సూరి(సందీప్), దొరబాబు, డాక్టర్(పృద్వీరాజ్)ల గూర్చి చిత్ర చెబుతుంది. నూతన దంపతులిద్దరూ ఒకరి గూర్చి మరొకరు లోతుగా చెప్పుకొని గుండెలపై భారం దించుకొంటారు. దైవం అనుకూలించడంతో వరద నుంచి ప్రాణాలు రక్షించుకోవడంతో సినిమా ముగుస్తుంది.

## కస్సుమన్న లక్ష్మీరాయ్!

కాంచన, అధినాయకుడు చిత్రాలలో ఆడిపాడిన లక్ష్మీరాయ్‌కి తమిళనాడులో కూడా మంచి క్రేజ్ ఉంది. అక్కడ ఆమె చేతిలో ఎప్పుడూ ఏదొక చిత్రం ఉంటుంది. ఈ భామ గూర్చి ఓ తమిళ పత్రిక వ్రాసిన కథనం కలకలం రేపింది. ప్రస్తుతం ఈమె తమిళంలో 'ఒన్బదుల గురు' అనే చిత్రం చేస్తోంది. వినయ్(వాన ఫేం) కథానాయకుడు. వారిద్దరికీ లింకుపెట్టి కథనం ప్రచురించింది ఓ తమిళ వారపత్రిక. అది చదివి నొచ్చుకొన్న లక్ష్మీరాయ్ కోర్టులో పరువు నష్టం కేసు దాఖలు చేసింది. ఈ వార్త తన పరువు ప్రతిష్టలకు భంగం కలిగించేలా ఉందనీ, ప్రచురణకర్తలు క్షమాపణ చెప్పి 30లక్షల రూపాయలు పరిహారంగా చెల్లించాలంటూ కేసు వేసిందామె.

## నయనతారకు సెక్యూరిటీ!

శ్రీరామరాజ్యం తర్వాత విలక్షణంగా సినిమాల్లో కనపడే ప్రయత్నం చేస్తుంది నయనతార. ఈ సినిమా తర్వాత కృష్ణం వందే జగద్గురుమ్, గ్రీకువీరుడు చిత్రాల్లో గ్లామర్‌గా కనిపించినా అభినయానికి పెద్దపీట వేసింది. ఇప్పుడు మరో డీ గ్లామర్ పాత్రలో కనిపించేందుకు నయనతార ఒప్పుకొంది. తమిళంలో కరుణానిధి మనుమడు ఉదయనిధి హీరోగా నటించే చిత్రంలో నయనతార మేకప్ లేకుండా నటిస్తోంది. ఈ సినిమాలో ఆమె మధ్యతరగతి ఉద్యోగినిగా కనిపిస్తుంది. ఇటీవల ఏం జరిగిందో ఏమో తెలియదు గానీ నయనతార తన వ్యక్తిగత రక్షణ సిబ్బందిని నియమించుకొంది. ఆమె షూటింగ్‌కుగానీ, ఏదైనా ప్రైవేట్ ఫంక్షన్‌కు గానీ బాడీగార్డ్స్ లేకుండా వెళ్లడం లేదు. ఆమె రక్షణ ఏర్పాట్లు చేసుకోవడం వెనుక ఉన్న సంగతేమిటనే విషయమ్మీద చర్చసాగుతోంది.

## టపోరిగా మహేష్‌బాబు?

పోకిరి, బిజినెస్‌మెన్ చిత్రాల కలెక్షన్లు తెలుగు సినిమా పరిశ్రమ బాక్సాఫీసు రికార్డులను బద్దలు కొట్టాయి. తెలుగు పరిశ్రమలో మహేష్‌బాబును పెద్ద స్టార్‌ను చేశాయి. పూరిజగన్నాథ్‌ను పెద్దస్టార్ డైరక్టర్‌ను చేసి పెట్టాయి. మహేష్‌బాబు, పూరిజగన్నాథ్ కాంబినేషన్‌లో మూడో సినిమాకు నిర్మాత బండ్లగణేష్ ప్రయత్నాలు మొదలెట్టారు. ప్రస్తుతం పూరి, బండ్ల గణేష్ నేతృత్వంలో అల్లుఅర్జున్ హీరో ఇద్దరమ్మాయిలు చిత్రం తయారవుతుంది. మహేష్‌బాబు కోసం పూరిజగన్నాథ్ చిత్రకథ తయారు చేశారని ఈ సినిమాకు 'టపోరి' అనే పేరు సిద్ధం చేసినట్లు ఫిల్మ్‌నగర్‌లో పుకార్లు షికార్లు చేస్తున్నాయి. మహేష్‌బాబు ప్రస్తుతం సుకుమార్, శ్రీనువైట్ల, క్రిష్ చిత్రాలలో నటిస్తున్నారు. ఈ మూడు సినిమాలు పూర్తయ్యాక టపోరి ప్రారంభమవుతోంది.

## కళ్యాణ్‌రామ్ శిరోముండనం!

కత్తి సినిమా తర్వాత హీరో నందమూరి కళ్యాణ్‌రామ్ నుంచి మరో చిత్రం రాలేదు. రెండేళ్లుగా ఆయన 'ఓమ్' అనే త్రీడీ చిత్రమ్మీదే దృష్టి కేంద్రీకరించారు. ఆ చిత్రానికి ఆయనే నిర్మాత. కెమెరామెన్ సునీల్‌రెడ్డి దర్శకత్వం వహిస్తున్నారు. గొప్పగా ఈ చిత్రం వుండాలని తలబోసిన కళ్యాణ్‌రామ్ అవతార్, స్పైడర్‌మేన్-4, రెసిడెంట్ ఈవిల్ లాంటి హాలీవుడ్ చిత్రాలకు పనిచేసిన సాంకేతిక నిపుణుల్ని ఈ చిత్రం కోసం ఎంచుకొన్నారు. చిత్రీకరణ పూర్తై ఏడు నెలలైంది. అప్పట్నించీ విజువల్ ఎఫెక్ట్స్‌కి సంబంధించిన పనులు నడుస్తున్నాయి. ఈ సినిమాలో ఆయన కొన్ని సన్నివేశాల్లో గుండుతో కనిపిస్తారు. కథ డిమాండ్ చేయడంతో శిరోముండనం చేయించుకోవాల్సొచ్చిందన్నారు.

## మళ్లీ సత్య!

ముంబై చీకటి సామ్రాజ్యనేత పేరుగాంచిన దావూద్ ఇబ్రహీం రిటైరైపోయాడు. ఛోటా రాజన్ విదేశాలకు వెళ్లిపోయాడు. అయినా ముంబైలో చీకటి సామ్రాజ్యం ఉంది. అది కొత్త రూపం సంతరించుకొంది. ఆ వ్యవహారమే తన చిత్రం అంటున్నాడు రాంగోపాల్ వర్మ. ఆయన దర్శకత్వంలో రూపుదిద్దుకోబోతున్న హిందీ చిత్రం సత్య-2. ఈ సినిమాను తెలుగులోనూ తెరకెక్కిస్తున్నారు. హిందీలో కొత్త నటుడు ప్రధానపాత్ర పోషిస్తున్నారు. తెలుగులో ఈ పాత్రను శర్వానంద్ పోషిస్తాడు. ఇటీవలే ముంబైలో కొంత చిత్రీకరణ సాగింది. గతంలో వచ్చిన సత్య చిత్రానికి ఇది కొనసాగింపు.

## పుచ్చకాయను తినండి!

ఈ సీజన్‌లో మంచిదంటున్న డాక్టర్లు


నెల్లూరు మార్కెట్‌లో విరివిగా వున్న పుచ్చకాయలు.

పుచ్చకాయల సీజన్ వచ్చేసింది. వేసవి ఎండలు, పుచ్చకాయలు ఒకేసారి వచ్చేస్తాయి. వేసవి తాపాన్ని తగ్గించి శరీరాన్ని చల్లబర్చడంలో పుచ్చకాయ శ్రేష్ఠమైనది. ఇందులో ఎన్నో ఆరోగ్య ప్రయోజనాలున్నాయి. యాంటీ ఆక్సిడెంట్లను కలిగి వుండే పుచ్చకాయను తినడం వల్ల తాజా భావనలు కలుగజేస్తుంది. ఒకప్పుడు వేసవి వస్తేనే పుచ్చకాయలు మార్కెట్లో కన్పించేవి. ఇప్పుడు సూపర్ మార్కెట్లు వచ్చేసిన తర్వాత ఏడాది పొడవునా దొరుకుతున్నాయి. దాహార్తి తీర్చే పుచ్చలో ఎలక్ట్రోలైట్స్, సోడియం, పొటాషియం వుంటాయి. ఇవి చెమట రూపంలో మనం కోల్పోయే లవణాలు ఖనిజాలు. అలాగే పుచ్చను తినడం వల్ల ఎలక్ట్రోలైట్ స్థాయిలు కాపాడబడతాయి. శక్తినిచ్చే బి-కాంప్లెక్స్ విటమిన్లు, మెగ్నీషియం వంటివి పుచ్చకాయలో అధికంగా లభిస్తాయి. అత్యధిక నీటితో నిండి వుండే పుచ్చకాయలో ఎక్కువ క్యాలరీలు వుండవు. ఇది శరీరంలో శక్తిని కోల్పోకుండా కాపాడడమే కాకుండా డీహైడ్రేషన్‌కు గురి కాకుండా చేస్తుంది. దీనిలో వుండే థయామిన్, రిబోఫ్లోవిన్‌లు శరీరాన్ని అనేక రుగ్మతల నుంచి కాపాడుతాయి. టమోటాల మాదిరే పుచ్చకాయలో సహజ సిద్ధమైన, శక్తివంతమైన 'లీకోపెన్' అనే యాంటీ ఆక్సిడెంట్లు అధికంగా వుంటాయి. ఇది శరీరంలో వుండే మలినాలను, ఫ్రీర్యాడికల్స్‌ను న్యూటలైజ్ చేస్తుంది. లోపలంతా గింజలతో నిండి, తినే సమయంలో నోటికి అడ్డం పడుతుంటాయని విసుక్కునే వారు పుచ్చకాయలో వుండే ఆరోగ్య ప్రయోజనాలు తెలుసుకొని వాటిని తినడం ఈ వేసవిలో చాలా మంచిదని వైద్యులు చెబుతున్నారు.

## ఉచిత నేత్ర వైద్య శిబిరం

### సెయింట్ జాన్స్ పూర్వ విద్యార్థుల సేవ

ప్రపంచ గ్లకోమాడేను పురస్కరించుకొని నెల్లూరు సుబేదారుపేటలోని సెయింట్ జాన్స్ ఇంగ్లీషు మీడియం స్కూల్ పూర్వ విద్యార్థుల సంఘం, లయన్స్ క్లబ్ ఆఫ్ పినాకిని సంయుక్త యాజమాన్యాన ఉచిత నేత్ర శిబిరాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా పూర్వ విద్యార్థుల సంఘం కన్వీనర్ లయన్ కె.చంద్రశేఖర్ మాట్లాడుతూ ఇటువంటి వైద్య శిబిరాలు ప్రభుత్వమే కాకుండా స్వచ్ఛంద సంస్థలు కూడా తమవంతు బాధ్యతగా సేవా కార్యక్రమాలు నిర్వహించాలని కోరారు.



విద్యార్థులకు కంటి వైద్య పరీక్షలు చేస్తున్న దృశ్యం.

ఈ సందర్భంగా మాదరన్ ఐ హాస్పిటల్ అండ్ రీసెర్చ్ సెంటర్ కంటి వైద్యులు 700 మంది విద్యార్థులకు కంటి పరీక్షలు చేశారు. ఈ కార్యక్రమంలో లయన్స్ క్లబ్ అధ్యక్షులు చెవుల యుగంధర్, పూర్వ విద్యార్థుల సంఘం సహకోశాధికారి అశోక్ చందర్, లయన్ సునీల్, సరాబు సునీల్, ప్రాజెక్ట్ ఛైర్మన్ సి.హెచ్.శివ ప్రసాద్, హాస్పిటల్ వీఆర్ఓ పి.చినబాలకొండయ్య, స్కూల్ సిబ్బంది తదితరులు పాల్గొన్నారు.

## ఇష్టానుసారంగా స్పీడ్‌బ్రేకర్ల ఏర్పాటు!

- నగరంలో ఇద్దరు ద్విచక్రవాహనదారుల మరణం


ప్రమాదాలు జరుగుతున్న మినీబైపాస్ రోడ్డులోని స్పీడ్ బ్రేకర్.

నెల్లూరు నగరంలోని వివిధ ప్రాంతాల్లో ఇష్టానుసారంగా స్పీడ్ బ్రేకర్లు ఏర్పాటు చేస్తుండడంతో వాహనదారులు తరచూ ప్రమాదాలకు గురవుతున్నారు. స్పీడ్‌బ్రేకర్లు ఏర్పాటు చేయాలంటే రోడ్లు, భవనాల శాఖ నుంచిగానీ లేదా మునిసిపల్ కార్పొరేషన్ నుంచి గానీ ముందుగా అనుమతి పొందాలి. స్పీడ్ బ్రేకర్లకు అనుమతి పొందితే రాత్రి సమయంలో వాహనదారులకు కనిపించే విధంగా బోర్డు ఏర్పాటు చేయాలి. కానీ పై విధంగా ఎక్కడా బోర్డులు ఏర్పాటు చేయడం లేదు. నెల్లూరు నగరంలో బాలాజీనగర్, ఎసినగర్, స్టోన్‌హౌస్‌పేట, పొదలకూరు రోడ్డు తదితర ప్రాంతాల్లో స్పీడ్ బ్రేకర్లున్నాయి. రాత్రి వేళల్లో ద్విచక్రవాహనదారులు వీటిని గమనించక పోవడం వలన గాయాలపాలై మృత్యువాత పడుతున్నారు. ఇటీవల నెల్లూరు నగరంలో స్పీడ్ బ్రేకర్ల కారణంగా ఇద్దరు వ్యక్తులు దుర్మరణం చెందారు. మినీబైపాస్ రోడ్డు నారాయణ కాలేజీ ఎదురుగా ఇరువైపులా రెండు స్పీడ్ బ్రేకర్లు వున్నాయి. ఈ మార్గంలో ద్విచక్రవాహనంపై వేగంగా వెళ్తూ ఎదురుగా వున్న స్పీడ్ బ్రేకర్‌ను గుర్తించక ఓ వ్యక్తి ప్రమాదానికి గురయ్యాడు. చికిత్స నిమిత్తం ఆసుపత్రికి తరలించే లోపల ప్రాణాలొదిలాడు. అలాగే కొండాయపాళెం సమీపంలో వున్న జాతీయ రహదారిపై ప్రియదర్శిని ఇంజనీరింగ్ కాలేజీలో బిటెక్ చదువుతున్న విద్యార్థి స్పీడ్ బ్రేకర్ దాటే సమయంలో ప్రమాదవశాత్తు కిందపడి దుర్మరణం చెందాడు. పై రెండు సంఘటనలు కేవలం ఉదాహరణ మాత్రమే. ఇటువంటివి నెల్లూరు నగరంలో ప్రతిరోజూ జరుగుతూనే వున్నా అధికారులు మాత్రం స్పందించడం లేదు. అనుమతిలేని స్పీడ్ బ్రేకర్లను తొలగించడం లేదా హెచ్చరికలతో కూడిన బోర్డులను ఏర్పాటు చేయాల్సి వుంది.

## ఇంటర్ స్పాట్ వాల్యుయేషన్‌పై నిఘా!

నెల్లూరు నగరంలోని కెఎసి కళాశాలలో జరుగుతున్న ఇంటర్ జవాబు పత్రాల వాల్యుయేషన్‌పై అధికారులు నిఘా పెట్టారు. కొందరు లెక్చరర్లు పేపర్లు దిద్దే కేంద్రంలోకి సెల్‌ఫోన్లతో ప్రవేశించి సంభాషిస్తున్నారు. ఈ విషయాన్ని తీవ్రంగా పరిగణించిన ఇంటర్ బోర్డు అధికారులు సెల్‌ఫోన్లలో మాట్లాడుతున్న వారిని తీవ్రంగా మందలించినట్లు తెలిసింది. మరోసారి ఫోన్లలో మాట్లాడుతూ మూల్యాంకనం చేస్తే క్రిమినల్ కేసులు నమోదు చేస్తామని గట్టిగా హెచ్చరికలు చేశారు. స్పాట్ వాల్యుయేషన్‌కు హాజరయ్యే లెక్చరర్లు సెల్‌ఫోన్లతో కేంద్రాల్లోకి రాకూడదని ముందుగానే సూచించారని అధికారులు చెప్పారు. అయినా కొందరు అధికారుల మాటలను పట్టించుకోకుండా సెల్‌ఫోన్లతో హాజరవుతూనే వున్నారు. ఇంటర్ జవాబు పత్రాలను త్వరితగతిన పూర్తిచేస్తే ఫలితాలు కూడా త్వరలోనే వెలువడుతాయి. మొత్తంమీద జవాబు పత్రాలుదిద్దే లెక్చరర్ల కదలికలపై ఇంటర్ బోర్డు అధికారులు పూర్తిస్థాయి నిఘా వుంచారు.

## వస్త్ర వ్యాపారుల నిరసన


గాంధీబొమ్మ వద్ద కొవ్వొత్తుల ప్రదర్శన.

వ్యాట్‌ను నిరసిస్తూ వస్త్ర వ్యాపారులు 15వ తేది కొవ్వొత్తుల ప్రదర్శన నిర్వహించారు. ఆచారి వీధిలోని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలు నుంచి బయలుదేరిన ఈ ప్రదర్శన కాపువీధి, ట్రంకురోడ్డు, ఆర్ఆర్‌వీధి, కనకమహల్ మీదుగా గాంధీబొమ్మ వద్దకు చేరుకొంది. వ్యాట్‌కు వ్యతిరేకంగా వ్యాపారులు నినాదాలు చేశారు. గాంధీబొమ్మ వద్ద రిలేనిరాహార దీక్షచేస్తున్న వస్త్ర వ్యాపారులను పరామర్శించారు. ఈ ప్రదర్శనకు క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ అధ్యక్షుడు నాగసూరి కామేశ్వరరావు, కార్యదర్శి నాగేశ్వరరావు, కోశాధికారి శ్రీనివాసులు, టివి కిషోర్, నాగేంద్రరావు, శ్రీరామ సుబ్బారావు, ఎ.శ్రీనివాసరావు, ధనుంజయ తదితరులు నాయకత్వం వహించారు.

## హక్కు రావాలంటే ప్రశ్నించాలి!

### వినియోగదారుల దినోత్సవంలో జెసి



సమావేశంలో మాట్లాడుతున్న జెసి లక్ష్మీకాంతం.

సమాజంలో ప్రతిఒక్కరూ ప్రశ్నించేతత్వాన్ని అలవరచుకొని తమ హక్కులను సాధించుకోవాలని వినియోగదారులకు జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం పిలుపు నిచ్చారు. ప్రపంచ వినియోగదారుల హక్కుల దినోత్సవాన్ని పురస్కరించుకొని జిల్లా పరిషత్ కార్యాలయ సమావేశ మందిరంలో 15వ తేది జరిగిన సదస్సుకు ముఖ్యఅతిథిగా విచ్చేసి మాట్లాడారు. ఎవరైనా తోటి వారిని మోసంచేస్తే అది తాత్కాలిక ఆనందమే అవుతుందన్నారు. విద్యార్థిస్థాయి నుంచే వినియోగదారుల హక్కుల గూర్చి అవగాహన కలిగి ఉండాలని చెప్పారు. పాఠశాల, కళాశాలల్లో మరిన్ని వినియోగదారుల క్లబ్‌లు ఏర్పాటు చేయాల్సిన అవసరం వుందన్నారు. జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ మాశిలామణి మాట్లాడుతూ డాక్టర్ సూచన మేరకే మందులు విక్రయించాలని వ్యాపారులకు సూచించారు. అలా కాని పక్షంలో అనేక సమస్యలు వస్తాయన్నారు. జిల్లా పౌరసరఫరాల శాఖాధికారి ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ ప్రతి రేషన్ డీలర్ కార్డుదారులకు నిస్వార్థ సేవలందించాలని సూచించారు. వినియోగదారులు ఎప్పటికప్పుడు వారికి జరిగిన అన్యాయాన్ని తమ దృష్టికి తెస్తే తక్షణం దాన్ని పరిష్కరిస్తామని చెప్పారు. వినియోగదారుల ఫోరం అధ్యక్షుడు వేలూరు శ్రీనివాసులు, జడ్పీ సిఇఓ వీరభద్రయ్య పాల్గొన్నారు.


నెల్లూరు కాపువీధి వాస్తవ్యులు వ్యాపారరీత్యా ప్రస్తుతం బెంగుళూరులో స్థిరపడ్డ గూడూరు రామశేషారెడ్డి కుమార్తె డాక్టర్ శ్రావ్య, డాక్టర్ వినయ్‌రెడ్డిల వివాహం ఫిబ్రవరి 14వ తేది సికింద్రాబాద్‌లోని జ్యూవెల్ గార్డెన్‌లో జరిగింది.

## తీవ్రవాద దాడులు

16వ పేజీ కొరవ

ఎన్నో చోట్ల జరిగింది ఇదే. కానీ భారతదేశంలోకి బాబర్ ప్రవేశించి 800 ఏళ్లు గడిచాయి. ఈ మధ్యలో అధిక భాగం పాలన మహమ్మదీయ రాజులదే. కానీ భారతదేశంలో ఇప్పటికీ హిందు మతం సజీవంగా వుంది. ఇరాన్, ఇరాక్, ఇండోనేషియా, తజకిస్తాన్, మలేషియా, ఉజెబికిస్తాన్, సౌదీ వంటి అరబ్ దేశాలు, ఈజిప్ట్, లిబియా, టర్కీ, నైజీరియా, మొరాకో, టర్కుమెనిస్తాన్, అల్జీరియా, లెబనాన్, అల్బేనియా, సుడాన్... ఇవన్నీ ముస్లిం దేశాలుగా మారిపోయాయి. ముస్లిం తీవ్రవాదులలో భారతదేశం పట్ల ప్రధాన అసంతృప్తి ఇదే. శతాబ్దాల ప్రయత్నం హిందు మతాన్ని క్షీణింప చేయలేదన్న నిస్పృహ వారిలో వుంది. ఈ దుర్భావనే మన దేశంలో తీవ్రవాదానికి ప్రధాన హేతువు. కాశ్మీర్ సమస్య అందుకొక కుంటిసాకు. పాకిస్తాన్ పాలకులు, సైన్యాధిపతులు, ఐఎస్ఐ వంటి నిఘా సంస్థలు కొన్ని దశాబ్దాలుగా భారత దేశంపై తమ ప్రజ లలో ద్వేషభావాన్ని పెంచి పోషిస్తున్నాయి. తమ దేశంలో అంతర్గత సమస్యలు ఉత్పన్నమైన ప్రతి సందర్భంలోనూ వారు పాటించే సూత్రం పొరుగు దేశం మీద నిందా ప్రచారం చేసి, ఉద్రిక్తత పెంచి, ప్రజల దృష్టి మళ్లించడం.

ఈ రోజు మొత్తం ప్రపంచానికి తలనొప్పిగా పరిణమించిన ఉగ్రవాద సంస్థలన్నీ పాకిస్తాన్ లేదా ఆఫ్ఘనిస్తాన్‌లో పురుడు పోసుకొన్నవే కావడం గమనార్హం. పాలస్తీనాలో పుట్టిన ఉగ్రవాద సంస్థలకు ఏకైక లక్ష్యం ఇజ్రాయిల్ మాత్రమే. కానీ పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లో పుట్టిన విష నాగులు మాత్రం మొత్తం ప్రపంచాన్ని కాటేయడానికి బుసలు కొడుతూ వుంటాయి. అల్‌ఖైదా, తాలిబన్, లష్కరే తొయిబా, జైషే మొహమ్మద్, హర్కత్ ఉల్ ముజాహిద్దీన్, హిజ్బుల్ ముజాహిద్దీన్, జమాతే ఇస్లాం, స్టూడెంట్ ఇస్లామిక్ మూవ్‌మెంట్ ఆఫ్ ఇండియా (సిమి), తెహ్రిక్ తాలిబన్... ఇట్లా ఈ జాబితా చాలా పెద్దదే తయారైంది. ఒక్కొక్క సంస్థను అణిచి వేసే కొద్దీ కొత్త సంస్థలు పుట్టుకొస్తున్నాయి. కొన్ని పేర్లు మార్చుకొంటున్నాయి.

### తీవ్రవాదం వల్ల నష్టపోయిన దేశాల్లో నెం. 1

ప్రపంచంలో ఇస్లామిక్ తీవ్రవాదం వల్ల అత్యధికంగా నష్టపోయిన, నష్టపోతూనే వున్న దేశాలలో భారతదేశం ప్రథమ స్థానంలో వుందని ఐక్యరాజ్య సమితి నివేదిక వెల్లడిస్తున్నది. మన దేశంలో దాదాపు వారానికొకసారి అయినా ఏదో ఒక చోట ఇస్లామిక్ తీవ్రవాదం వల్ల ప్రజలు ఇబ్బంది పడుతూనే వున్నారు. అమెరికాకు, చాలా ఐరోపా దేశాలకూ ఈ సమస్య వుంది. కానీ వారు తమ భద్రతా వ్యవస్థలను, నిఘా సంస్థలను పటిష్ట పరచుకోవడం ద్వారా తీవ్రవాదం వల్ల కలిగే అనర్థాలను కనీస స్థాయిలో అణిచి పెట్టగలుగుతున్నారు. కానీ భారత దేశంలోని ప్రభుత్వాలు మాత్రం ఆ కోణంలో దారుణంగా విఫలమౌతున్నాయి.

### ముస్లిం మేధావులు మాట్లాడాలి!

అందుకు కారణం – ముస్లింలను ఓటు బ్యాంకుగా చూసే దుష్ట రాజకీయం. నిజానికి మన దేశంలో జరిగే ఇస్లామిక్ తీవ్రవాద అకృత్యాలలో మన దేశానికి చెందిన ముస్లిం పాత్ర చాలా పరిమితం. పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, బంగ్లాదేశ్ ల నుంచి వలస వచ్చిన దుర్మార్గులే ఈ ఘాతుకాలకు పాల్పడుతున్నారు. వారికి స్థానిక సహకారం మాత్రం మన ముస్లింల నుంచి అందుతున్నది. ఆ ధోరణిని అణిచివేయాలంటే తీవ్రవాద సంస్థలతో సంబంధం వున్నవారి పట్ల కఠినంగా వ్యవహరించాలి. కానీ అందుకు మన రాజకీయ పార్టీలు సిద్ధంగా లేవు. మన పార్లమెంట్ మీద దాడికి తెగబడిన అఫ్జల్ గురు ఉరి శిక్ష ఖరారు చేయడానికి దశాబ్ద కాలం పట్టింది మన నేతలకు. ఎట్టో సాహసించి శిక్ష అమలు చేస్తే దాన్ని ఖండిస్తూ చర్చ జరిపింది జమ్ము కాశ్మీర్ శాసన సభ. ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి ఒమర్ అబ్దుల్లా అఫ్జల్ గురు ఆరాధ్యనీయుడని ప్రశంసించాడు. పాకిస్తాన్ నుంచి వచ్చి, బొంబాయి నగరంలో నెత్తుటి ఏర్లు పారించిన కసబ్‌ను అమాయక పిల్లవాడిగా అభివర్ణించాడు మజ్లిస్ నేత అక్బరుద్దీన్ ఒవైసీ.

తీవ్రవాదులతో మన దేశంలోని ముస్లిం ప్రజలకు కానీ, నేతలకు కానీ సంబంధాలు లేవు. ఆ అకృత్యాలలో వారి ప్రమేయం లేదు. కానీ తీవ్రవాద దుశ్చర్యలను వ్యతిరేకించడంలో ముస్లిం సంస్థలు, మేధావులు, నేతలు వెనుకాడుతున్నారు. తీవ్రవాదులను విమర్శిస్తే ముస్లిం సమాజం దృష్టిలో దోషులుగా నిలబడతామన్న భయంతో బ్రతుకుతున్నారు. ఇది చాలా అవాంఛనీయ పోకడ.

---

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

లోని శ్రీనివాస స్కూల్‌లో పదవ తరగతి చదువుతున్న విద్యార్థులందరూ చక్కగా పరీక్ష వ్రాయాలని సరస్వతి పూజ నిర్వహించి వీరందరికీ సంస్థ అధ్యక్షుడు మురళీమోహన్‌రాజు అట్టలు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో కార్మికశాఖ సహ కమిషనర్ రాచపాళెం రఘు, స్కూల్ కరస్పాండెంట్ ఎస్వీ సుబ్బయ్య, తిక్కన రచయితల సంఘం ఉపాధ్యక్షులు పంచాగ్నుల విశ్వేశ్వరశర్మ పాల్గొన్నారు.

### నిషేధిత గుట్కాలు పోలీసులకు చిక్కాయి

ప్రభుత్వం నిషేధించిన గుట్కా ప్యాకెట్లను అక్రమంగా తరలిస్తుండగా పోలీసులు పట్టుకొన్నారు. పాన్‌పరాగ్‌తోపాటు ఖైనీ ప్యాకెట్లను నిషేధించారు. గత కొంతకాలంగా ఇవి అక్రమంగా రవాణా జరుగుతున్నాయి. మినీబైపాస్‌రోడ్డులో సాయిబాబా మందిరానికి ఎదురుగాగల ఒక ట్రాన్స్‌పోర్టు కార్యాలయంలో ఈ ఖైనీ ప్యాకెట్లు తరలిస్తున్నారని సమాచారం అందుకొన్న ఆరవ పట్టణ పోలీసులు దాడి చేశారు. అక్కడ రవాణాకు సిద్ధంగా వున్న ఒకటిన్నర లక్షల రూపాయలు విలువచేసే ఖైనీ ప్యాకెట్లను స్వాధీనం చేసుకొని, అక్రమ వ్యాపారం చేస్తున్నారనే అనుమానంపై ఓ వ్యక్తిని అరెస్టు చేశారు.

### పనిచేసే డాక్టర్లకే అవకాశం కల్పించాలి!

పెద్దాసుపత్రిలో నిర్మిస్తున్న మెడికల్ కళాశాలలో ఇక్కడ పనిచేస్తున్న డాక్టర్లకే ఉద్యోగాల్లో ప్రాధాన్యత ఇవ్వాలని ప్రభుత్వ వైద్యులు డిమాండ్ చేశారు. ఎన్నో ఏళ్లుగా పనిచేస్తున్న డాక్టర్లందరినీ వేరే చోటుకి పంపించి కొత్తవారిని తీసుకోవాలని చూడడం సరైన నిర్ణయం కాదన్నారు. ఈ ప్రయత్నాన్ని విరమించుకొని పెద్దాసుపత్రిలో పనిచేసే డాక్టర్లకే అవకాశం కల్పించాలని, లేదంటే ఉద్యమిస్తామని ప్రభుత్వ వైద్యుల సంఘం నేత డాక్టర్ రామకృష్ణారావు హెచ్చరించారు. పెద్దాసుపత్రిలో ఐదారు మంది డాక్టర్లు మినహా సిబ్బంది కూడా ఎంత మేరకు పనిచేస్తున్నారన్నది ఎవర్ని అడిగినా చెబుతారు. మీరే మెడికల్ కాలేజిలో చేరి దాన్ని కూడా ఎందుకు గబ్బు పట్టించడం రామకృష్ణారావు గారు!

### ఎఆర్ ఎఎస్పీగా మూర్తి

ఆర్మ్‌డ్ రిజర్వు ఫోర్స్ ఎఎస్పీగా ఐఎన్ఆర్ మూర్తి 19వ తేది బాధ్యతలు తీసుకొన్నారు. హైదరాబాద్‌లోని డిజిపి కార్యాలయంలో పనిచేస్తూ బదలీపై ఇక్కడికి వచ్చారు. ఇక్కడ చాలా రోజులుగా ఈ పోస్టులో పనిచేసిన నాగేశ్వరరావు ఖమ్మం బదలీ అయ్యారు. కొత్త ఎఎస్పీ బాధ్యతలు తీసుకోగానే పోలీస్ కానిస్టేబుళ్ల ఎంపిక చేపట్టాల్సి వచ్చింది.

### సబ్ ట్రెజరీలకు కొత్త భవనాలు

జిల్లాలోని సబ్ ట్రెజరీ కార్యాలయాలకు నూతన భవనాలు రానున్నాయి. కావలి, గూడూరు, వెంకటగిరి, సూళ్లూరుపేట తదితర ప్రాంతాలలో గల ఉప ఖజానా కార్యాలయాల నూతన భవనాలు నిర్మించేందుకు ప్రభుత్వం అనుమతి మంజూరు చేసింది. వీటితోపాటు శిథిలమైపోయిన వాటికి, అద్దె భవనాల్లో నిర్వహిస్తున్న కార్యాలయాలకు కొత్త భవనాలు రానున్నాయి. వీటి నిర్మాణాలు ప్రారంభమవుతాయని జిల్లా ఖజానా అధికారి రుద్రప్రతాప్ తెలిపారు.

---

## చిల్లర రాజకీయం

9వ పేజీ కొరవ

వాడు. ఎవరితోనూ వివాదాలు పెట్టుకోనే వాడు కాదు. ఇన్ని మంచి లక్షణాలున్నాయి కాబట్టే జగన్ అనిల్ అభ్యర్థిత్వాన్ని అందరికంటే ముందు సూచన చేశాడు. కానీ ఇప్పుడు రాజమోహన్‌రెడ్డి ఒప్పుకోవడం లేదు. జిల్లాలో కనీసం ఒక స్థానమైనా వెనుకబడిన తరగతులకు చెందిన వారికి ఇచ్చి తీరాల్సిన అవసరం వుందని, వున్న అభ్యర్థిని కూడా మార్చి వేస్తే బిసిలలో పార్టీ పట్ల కోపం పుడుతుందని, అది అందరికీ నష్టమని నానా విధాలా నచ్చ చెప్పాడట వైవి సుబ్బారెడ్డి. కానీ రాజమోహన్‌రెడ్డి గారు విన్పించుకోవడం లేదు. జగన్ కాంగ్రెస్‌ను వదలి బయటకు వచ్చినప్పుడు తన వ్యాపారాలు, తన పదవి, తన రాజకీయం ఏమౌతాయనే ఆలోచన లేకుండా వున్న పాటున వెంట నడిచిన వాడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి. ఒక రకంగా చెప్పాలంటే ఆ రోజు పరిస్థితికి ఆయన చేసింది చాలా పెద్ద త్యాగం క్రిందే లెక్క. అందువల్లనే జగన్‌తో సహా ఆ పార్టీలోని పెద్దలందరూ ఆయన్ను గౌరవిస్తున్నారు, అభిమానిస్తున్నారు. ఆ అవకాశాన్ని వాడుకొని ఉన్నత స్థాయిలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకోవాల్సిన రాజమోహన్‌రెడ్డి ఎవరి చెప్పుడు మాటలో విని చిల్లర రాజకీయాలలో వేలుపెట్టి, తన స్థాయిని తాను కించపరచుకొంటున్నాడు. దాని వల్ల జిల్లా పార్టీలో గందరగోళ పరిస్థితులు నెలకొంటున్నాయి. ఎవరికీ భద్రతలేని వాతావరణం ఏర్పడుతున్నది. ఇది మంచిది కాదని జగన్ గోల. జగన్ మనస్తత్వాన్ని బట్టి రాజమోహన్‌రెడ్డి ఎంత గట్టిగా పట్టుబట్టినా అభ్యర్థిత్వాల విషయంలో మార్పులు వుండవని ఆ పార్టీ అగ్రనేతలే చెప్తున్నారు. అదే జరిగితే ఆయన చాలా నొచ్చుకోవలసి వస్తుంది. జిల్లాలో ఇబ్బందికర పరిస్థితులు ఎదుర్కోవలసి వస్తుంది. ఇప్పటికైనా ఆయన పెద్ద మనసుతో, పెద్ద మనిషి వలె ప్రవర్తిస్తే ఆయనకు మేలు, పార్టీకి మేలు అని పార్టీ నేతల మనసులోని భావన.

---

## స్థానిక ఎన్నికల కవచం

9వ పేజీ కొరవ

అయితే కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఎవరికి కూడా ఈ ఎన్నికల పట్ల ఆసక్తి లేదు. పైపెచ్చు, లేనిపోని తలనొప్పులు తెచ్చుకోవడమని భావిస్తున్నారు. రాష్ట్రంలో ఇప్పుడు కాంగ్రెస్‌కు ఎదురు గాలి వీస్తున్నది. కరెంట్ సమస్య అన్నిటికంటే భీకరంగా వుంది. కాంగ్రెస్ జెండా పట్టుకొని గ్రామాలకు వెళ్తే జనం రాళ్లతో కొట్టేట్లున్నారు. ఆ నిజం ఎమ్మెల్యేలకు తెలుసు. అందువల్లనే మాకీ ఎన్నికల చీకాకు వద్దు మహాప్రభో అని ముఖ్యమంత్రి వద్ద మొరపెట్టుకొంటున్నారు వారందరూ కలిసి కానీ కిరణ్ మాత్రం విన్పించుకొనే ధోరణిలో లేడు. అందుకాయన చెప్తున్న కారణం – స్థానిక సంస్థల ద్వారా జగన్ ప్రభంజనాన్ని కొంతలో కొంత తగ్గించవచ్చునన్న ఆలోచన. ఒకసారి ఓటు వేసిన తర్వాత జనంలో జగన్ పట్ల మోజు వుండదని, దాని ద్వారా రేపటి శాసనసభ ఎన్నికలలో జగన్‌ను నిలువరించవచ్చునని, ఏతావాతా వీటి వల్ల కాంగ్రెస్‌కు లాభమే తప్ప నష్టం వుండదని నచ్చ చెప్తున్నాడు కిరణ్ కుమార్ రెడ్డి.

---

## కిరణ్‌కు పదవీ గండం

మొదటి పేజీ కొరవ

నామా చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అవిశ్వాసం రూపంలో కాకుండా ఈ తీర్మానాలపై ఓటింగ్ కోరడం ద్వారా చంద్రబాబు కిరణ్ సర్కారును ఇరకాటంలో పెడతాడని పరిశీలకుల వూహ. ఆ పరిస్థితే వస్తే జగన్ పార్టీ కూడా చంద్రబాబుకు మద్దతు ఇవ్వక తప్పదు. వారికి కావలసింది కూడా కిరణ్ ప్రభుత్వం కూలిపోవడం కదా? అందువల్ల ఈ బడ్జెట్ సమావేశాలలోనే కిరణ్ పదవికి కొత్త గండం సృష్టించే వ్యూహంలో వున్నాడు చంద్రబాబు.

---

## జనవాణి

2వ పేజీ కొరవ

సాధించగల ధీరుడు. సమయోచిత ప్రజ్ఞాపాటవాలతో జట్టును ఒంటి చేత్తో నడిపించగల కెప్టెన్ ధోనీ. ప్రపంచ ప్రసిద్ధి పొందిన మన భారతీయ క్రికెట్ జట్టులోని బ్యాట్స్‌మెన్లు, బౌలర్లు తమకు అనుకూలమైన పిచ్‌లు తయారు చేసుకొని ఆస్ట్రేలియా జట్టుపై అవలీలగా గెలవగలడం క్రీడాస్ఫూర్తికి విరుద్ధం. ఈ చర్య క్రికెట్ చరిత్రలో మన పరువును గంగపాలు చేసింది. ఈ విషయమై క్రికెట్ జట్టు సెలక్షన్ కమిటీ, ప్రభుత్వం ఆలోచించ మనవి.

*తనిశెట్టి వెంకటరమణయ్య మాచర్లవారిపాళెం*

### ముత్తుకూరు గ్యాస్ ఏజెన్సీ వసూళ్లు!

ముత్తుకూరు ఆదిత్యా ఇండేన్ గ్యాస్ ఏజెన్సీ సకాలంలో వినియోగదారులకు సిలిండర్లు పంపిణీ చేయడం లేదు. దీనికితోడు సిలిండరుకు 460 రూపాయలు వసూలు చేస్తున్నారు. పౌరసరఫరాల శాఖాధికారులు ఈ ఏజెన్సీ నిర్వాహకులను నియంత్రించాల్సి వుంది.

పి.కృష్ణమూర్తి మాచర్లవారిపాళెం

## పదరంగం -60

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | 4 | | | 5 | 6 | |
| | | 7 | | | | 8 | | | |
| 9 | 10 | | | | 11 | | | 12 | 13 |
| 14 | | 15 | | | 16 | 17 | 18 | | |
| | 19 | | 20 | | 21 | | 22 | | |
| 23 | | | 24 | | | | 25 | | |
| 26 | 27 | | | | | 28 | | | 29 |
| 30 | | | 31 | | 32 | | | 33 | |
| | | 34 | 35 | | 36 | | | | |
| | 37 | | 38 | | | | 39 | | |

**అడ్డం**

1. పరమ శివుని జన్మరాత్రి (6)
5. అసలు కాదు కాపి, డూప్లికేటు (3)
7. బాణము (3)
8. వాసన గల ముండ్ల పూవులో మొదటి సగం (3)
9. అటునుంచి సహాయం (2)
12. నెపం, కారణం, సాగు (2)
14. ముల్లు, గ్రుచ్చుకుంటుంది (3)
16. నేల, వసుంధర (3)
19. అటునుంచి ప్రదోషకాలం తెల్లవారుజాము వేళ (4)
21. తెలుగు డిపాజిట్టు (4)
24. తీరం, ఒడ్డు (2)
25. శిరస్సు (2)
26. నరజన్మ ఎత్తినవాడు (3)
28. తోక (2)
30. అటునుంచి గోవు, ధేనువు (2)
32. అటునుంచి నాలుక, రుచి చాపల్యం కలది (2)
33. వేగం, అంకము (2)
34. వేడి (3)
36. రాజస్థానము సభ (4)
37. కర్ణము (2)
38. బుల్లిపాప (3)
39. పేజి (2)

**నిలువు**

1. కరాళంలా విన్పించే హంస (4)
2. క్రింద నుంచి చంద్రుడు (2)
3. ఫ్లడ్, వెల్లువ (3)
4. రామారావుని ఇంట్లో ఇలాగే పిలుస్తారు (2)
5. ఆభరణం (2)
6. సంపద, లేమికి వ్యతిరేకం (3)
10. దేవుడు (3)
11. ఏరు దాటించేది (2)
13. కండిషన్ (3)
15. కొడుకు (4)
17. అమృతం (2)
18. నేల, భూమి (4)
20. ఇరువైపులా సంతోషమే (3)
22. నెట్, జాలం (2)
23. మానవత్వం గల నరుడు (4)
27. ఐదుకి ఏడుకి మధ్య సంఖ్య క్రింద నుంచి (2)
28. బీజేపి నాయకుడు, మాజీ ప్రధాని (4)
29. స్కూల్ బెల్ (4)
31. తెలుగు మ్యాట్ (2)
33. వల వేసే ప్రేమ (3)
34. సువాసన (2)
35. క్రింద నుంచి సర్పము (2)

**సమాధానాలు**

## పదరంగం -59

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఘ | ర్మ | జ | 2 లం | | 3 వే | ది | 4 క | | 5 వా |
| మ | | | 6 ఖ | లు | డు | | లి | | ణి |
| 7 డు | 8 క్రీ | | నం | | 9 క | 10 ల | కం | 11 ఠి | |
| | 12 చ | 13 లి | | 14 అ | | క్ష | | 15 సోం | 16 త |
| 17 లు | కు | ఆ | | 18 సు | గు | ణం | | | ని |
| 19 తా | డు | | 20 పే | రు | | | | 21 ర | వి |
| పం | | 22 చె | ద | లు | | 23 మ | 24 స | క | |
| | 25 శ్రీ | | వా | | 26 వి | ర | హ | ము | 27 లో |
| 28 మే | | 29 కం | డు | 30 వా | | 31 క | న | | కం |
| 32 క | ర | చు | | న | | 33 లు | ము | పా | |

### మానవ జీవిత అస్తిత్వ...

# బాధాసంవేదనతో చీలిన మనిషి!

ఆత్మాశయత్వమే ప్రధానంగా తన జీవన వాస్తవిక అనుభవాలతో తనకుతాను జరిపిన మాన సంభాషణ ఈతకోట సుబ్బారావు 'చీలిన మనిషి' కవితా సంపుటి. హృదయంలోని కల్లోలానికి, మనసులోని సంక్షోభం తోడైతే జనించే కవితా వాస్తవికతను ఈ సంపుటిలోని నలభై ఐదు కవితలూ విస్తారంగా ప్రతిబింబించాయి. ఆధునిక స్థితిని దాటి అత్యాధునికంగా తయారైన సమకాలీన వ్యవస్థ ఇనుప పాదాల కింద నలిగిపోతున్న మట్టి మనిషి మనోగతంలో గతానికీ, వర్తమానానికీ జరుగుతున్న ఘర్షణకు ప్రతీకలే కవితలు. ఇందులోని కవితలన్నీ గతంలో పత్రికల్లో ప్రచురించినవే. ఎక్కువ కవితలు వివిధ పురస్కారాలకు నోచుకొన్నవి. నిజానికి ఆత్మానుభూతి విస్తృతి పెరిగిన వాడే మంచి కవిత్వం రాయగలడు. తనలో కదలాడే భావాలకు పాదుపైన అక్షర రూపం యివ్వడంలో సుబ్బారావు సిద్ధహస్తుడు. అలాగే కవిత్వ వస్తువును ఎన్నుకోవడంలోనూ శ్రద్ధ కనిపిస్తుంది. సమకాలీన సమాజం అనుభవిస్తున్న అనేక రుగ్మతలు, కవి అంతరంగంలో జ్ఞాపకాల వేదనలూ ఈ కవితా సంపుటి వస్తువులు. ఈ కవితల్లో తీవ్రమైన ఆర్తి వుంది. మానవత్వం కోసం అన్వేషణ వుంది. మనిషిని సరుకు చేస్తున్న మార్కెట్ ఆధారిత నాగరికత మీద ద్వేషం వుంది. దిగులూ వుంది. ఇవన్నీ కలిసిన అనంతానంత వేదనతో నిండిన కవి హృదయం నుంచి జాలువారిన ఈ కవితలు పాఠకులను ఆలోచనకు గురిచేస్తాయి. అంతిమంగా పాఠకుడి సబ్‌కాన్షియస్‌లో గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్ ప్రక్రియలో అస్తిత్వం కోల్పోతున్న ఆధునిక మానవుడి(?) అంతరంగంలో భావాత్మక సంవేదనలని ప్రబుద్ధం చేస్తాయి. నిజానికి ఈ కవితల్లోని టెక్నిను వాచ్యార్థంలో అనుభవించగలమే కాని వివరించలేం. బహుశా కవితా విమర్శకు ఇదో మినహాయింపు కావొచ్చు. శకలాలుగా చీలి పగులుతున్న సమకాలీన మానవ జీవిత అస్తిత్వ బాధా సంవేదల్ని కవిత్వీకరించడంలో కవి విజయవంతమయ్యాడు. ఈ కవితల్లో కవి హృదయంలోని అభద్రతాభావంలో జనించిన ఒకానొక దుఃఖం వాక్యాల నిండా పరుచుకొంటుంది. ఆ దుఃఖం తాలుకు మార్మికత కవిత్వానికో సొగసును ఇస్తుంది. ఇదే టెక్నిక్‌తో ఈ కవితలన్నీ సాగడం ఈ సంపుటిలో విశేషం. అయితే కొన్ని కవితలు కొంత ఎడిట్ చేసుకొంటే బావుండేది. అలాగే కవితా శిల్పానికి సంబంధించిన మూస ధోరణి కూడా అక్కడక్కడా విసుగు కలిగిస్తుంది. నిజానికి స్పందన లేకుండా ఎవరూ కవిత్వం రాయరు. ప్రతి కవిలో వెనుక ఒక నిర్దిష్ట ఆలోచన వుంటుంది. తరువాతే ఆలోచన కవితగా వ్యక్తీకరించబడుతుంది. ఈ క్రమంలో భాషను నిర్దిష్టంగా, కచ్చితంగా ప్రయోగించగలిగే కవితలు పాఠకుల రసానుభూతికి దోహదం చేస్తాయి. ఈ విషయంలో సుబ్బారావు కొంచెం శ్రద్ధ చూపగలిగితే తెలుగులో సుబ్బారావు విలక్షణ కవిగా మరింత ఉన్నత స్థాయికి చేరుకొంటాడు.

**పుస్తకసమీక్ష**

**చీలిన మనిషి**
(కవితా సంపుటి)
రచయిత : **ఈతకోట సుబ్బారావు**
సమీక్షకుడు : **డాక్టర్ ధనిశెట్టి లెనిన్**
వెల : **70/-** పేజీలు : **104**
**ప్రతులకు : ఈతకోట సుబ్బారావు**
హెచ్.నెం.24/1175, 2వ వీధి,
రవీంద్రనగర్, నెల్లూరు.
పాలపిట్ట బుక్స్, హైదరాబాద్.

# ఐకెపిలో ఎపిఎంల ఇష్టారాజ్యం!

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, ఇందిర క్రాంతి పథంలో పనిచేస్తున్న ఎపిఎంలు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ స్వయం సహాయక సంఘాల సభ్యులను ఇబ్బంది పెడుతున్నారు. స్వయం సహాయక సంఘాల మహిళలకు బ్యాంకు లింకేజి రుణాలు మంజూరు చేయించడం, రుణాలను రికవరీ చేయించడం, ఆర్థికంగా మహిళలు ఎదిగేందుకు సహకరించడం వంటి బాధ్యతలు ఎపిఎంలు నిర్వహించాలి. అయితే ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తూ ప్రభుత్వ లక్ష్యాలను సైతం నెరవేరుస్తున్నారు. రెండు మూడు మండలాలకు కలిపి ఒక ఎపిఎం విధులు నిర్వహిస్తుంటారు. గ్రామీణ ప్రాంతాల్లో పొదుపు మహిళలతో నెలవారీ సమీక్షలు నిర్వహించి వారి సందేహాలు నివృత్తి చేయాల్సి వుంటుంది. కొన్ని గ్రామాల్లో పొదుపు మహిళలు ఎపిఎం మొహాలు కూడా చూడలేదంటే ఆశ్చర్యపోక తప్పదు. మండల సమాఖ్యలో పనిచేస్తున్న కొందరు లీడర్లు రికవరీలు చేస్తుంటారు. రికవరీ చేయబడిన నగదును బ్యాంకులో జమ చేస్తున్నారా లేదా అన్నది కూడా తెలియపరచడం లేదు.


రైతు లోకం

# ప్రత్తిలో రసం పీల్చే పురుగులు - యాజమాన్యం!

సాధారణంగా ప్రత్తి విత్తిన 50-60 రోజుల వరకు రసం పీల్చే పురుగులైన పేను బంక, పచ్చదోమ, తామర పురుగులు ఆశించేవి. కాని మారిన సాగు పద్ధతులు మరియు వాతావరణ పరిస్థితులు వల్ల పేను బంక మరియు పచ్చదోమ దాదాపు పంట చివరి కాలం వరకు ఆశించి నష్టపరుస్తున్నాయి. పేను బంక ఆశించిన మొక్కలు 10-20 శాతం, పచ్చదోమలు ఆకుకు 2, తెల్లదోమ తల్లి పురుగులు ఆకుకు 6, పిల్ల పురుగులు 20, తామర పురుగు తల్లి పురుగులు ఆకుకు 20 వున్న ఎడల ఆయా పురుగుల వల్ల పంటకు నష్టం అధికంగా వుంటుంది.

**యాజమాన్యం**

మోనోక్రోటోఫాస్ లేదా మిథైల్ డెమటాన్ మరియు నీరు 1:4 నిష్పత్తిలో లేక ఇమిడాక్లోప్రిడ్ 200 యస్.యల్. మరియు నీరు 1:20 నిష్పత్తిలో కలిపిన ద్రావణం విత్తిన 20, 40, 60 రోజుల్లో (పురుగు నష్టపరిమాణం దృష్టిలో వుంచుకొని) మొక్క లేత కాండానికి బ్రష్‌తో పూస్తే రసం పీల్చే పురుగులను అదుపులో వుంచుతుంది. ఈ పద్ధతి వల్ల పురుగు మందు ఖర్చు తగ్గటమేకాక వాతావరణ కాలుష్యం కూడా తగ్గుతుంది. చివరగా అవసరాన్ని బట్టి లీటరు నీటికి మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీ లీటర్లు లేదా ఇమిడాక్లోప్రిడ్ 200 యస్.యల్. 0.4 మిల్లీలీటర్లు లేదా ఎసిటామిప్రిడ్ 0.2 గ్రాములు లేదా థయోమిథాక్సామ్ 0.2గ్రాములు మోతాదులో కలిపి పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

**సూచనలు**

రసం పీల్చే పురుగుల నివారణకు తొలి దశలో ఎక్కువసార్లు పురుగు మందులు పిచికారీ చెయ్యరాదు. తెల్లదోమ ఉధృతి ఎక్కువగా వుంటే పసుపు రంగు డబ్బాలకు జిగురుపూసి వుంచితే తెల్లదోమలు ఆకర్షింపబడి జిగురుకు అంటుకొంటాయి. తెల్లదోమ ఆశించినప్పుడు పైరిత్రాయిడ్ మందుల వాడకాన్ని వెంటనే నిలిపివేయాలి. తెల్లదోమను అదుపులో వుంచటానికి లీటరు నీటికి 2.5మిల్లీలీటర్లు ట్రైడోఫోస్ మరియు 5 మిల్లీలీటర్లు వేపనూనె కలిపి ఆకుల అడుగు భాగాన పడేటట్లు పిచికారీ చేయాలి. 

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

## ● అమెరికాపై కక్షతో...

# భారతదేశంపై తరచూ తీవ్రవాద దాడులు!

- తీవ్రవాదులు అమెరికాపై దాడి చేయడం చాలాకష్టం.
- అమెరికా ఎంత ఘోరానికి పాల్పడ్డా సమర్థిస్తున్న ప్రధాని మన్మోహన్‌సింగ్‌పై తీవ్రవాదులకు కోపం.
- పాలస్తీనా పోరాటానికి సంపూర్ణ మద్దతిచ్చిన నెహ్రూ, ఇందిర.
- ఇస్లామిక్ తీవ్రవాదుల మానసాలలో భారతదేశంలో హిందూ మతాన్ని నిర్మూలించలేకపోయామన్న బాధ.
- భారతదేశంపై వారానికోసారైన తెగబడుతున్న తీవ్రవాదులు.



హైదరాబాద్‌లో మొన్న జరిగిన బాంబు పేలుళ్లు ప్రజలను తీవ్రంగా కలిచి వేస్తున్నాయి. నగర వాసులలో ఒక విధమైన అభద్రతా భావాన్ని కల్గించాయవి. బొంబాయి నగరం మీద జరిగిన దాడితో పోలిస్తే ఇది పెద్ద సంఘటన కాదు. కానీ ఎవరు పడితే వారు, ఎప్పుడనుకొంటే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ బాంబులు పేల్చి అమాయకుల ప్రాణాలు తీయవచ్చునన్న ధోరణికి హైదరాబాద్ బాంబు పేలుళ్లు ఒక నిదర్శనం. ఈ పరిస్థితి కొనసాగితే ఇక వీధులలో తిరగడం కూడా వీలు కాదేమో అన్న భీతి జనం మనసులలోని ఆందోళన.

ఇంతకూ తీవ్రవాదులు ఇటువంటి ఘాతుకాలకు ఎందుకు పాల్పడుతున్నారు వారికి కావాల్సింది ఏమిటి? లక్ష్యం ఏమిటి? అమాయకుల ప్రాణాలు తీసి వారు సాధించేది ఏమిటి? అది మతమా? రాజకీయమా? ఉన్మాదమా? మరొక కారణమా?

### ఊతమిచ్చింది అమెరికానే!

ఇస్లామిక్ తీవ్రవాదం అనేది భారతదేశం ఒక్కదాన్ని పీడిస్తున్న సమస్య కాదు. ఇప్పుడే పుట్టిన విష పురుగు కూడా కాదు. దానికి సుదీర్ఘ చరిత్ర వుంది. వందల ఏళ్ల క్రితమే క్రైస్తవులకు, మహమ్మదీయులకు మధ్య యుద్ధాలు నడిచాయి. క్రూసేడులుగా చరిత్ర కెక్కాయి. అప్పటినుంచి పాశ్చాత్య దేశాలను, మరీ ముఖ్యంగా యూదులను తమ శత్రువులుగా చూడడం ముస్లిం సమాజానికి ఆనవాయితీగా మారింది. విచిత్రం ఏమిటంటే ఆధునిక కాలంలో ఇస్లామిక్ తీవ్రవాదం వేళ్లూనుకోవడానికి ఊతం ఇచ్చింది అమెరికా కావడం. ప్రచ్ఛన్న యుద్ధం కాలంలో సోవియట్ రష్యా ప్రాచుర్యాన్ని తగ్గించడానికి దక్షిణ ఆసియా, తూర్పు పాశ్చాత్య దేశాలలో ఇస్లామిక్ తీవ్రవాదులకు ఆయుధాలు, శిక్షణ, తోడ్పాటు అందించింది అమెరికా. అమెరికా అధ్యక్ష భవనం మీదనే ఆత్మాహుతి విమానాన్ని కూల్చిన ఆఫ్గనిస్తాన్ తీవ్రవాదుల తాలిబన్ ఉద్యమానికి ఆజ్యం పోసింది అమెరికా అన్న నిజం అందరికీ తెలిసిందే. ఒసామా బిన్ లాడెన్‌కు ఎన్నో ఏళ్లపాటు సైనిక మద్దతు ఇచ్చారు వారు. చివరకది భస్మాసుర హస్తంగా పరిణమించడంతో పొరుగు దేశాల సార్వభౌమాధికారాన్ని కూడా ఉల్లంఘించి పాకిస్తాన్‌లో తల దాచుకొన్న ఒసామా బిన్ లాడెన్‌ను హతమార్చింది అదే అమెరికా. ఆఫ్గనిస్తాన్ కంటే ముందు ఇస్లామిక్ తీవ్రవాదానికి కేంద్ర స్థానం పాలస్తీనా. దానికి కూడా సుదీర్ఘమైన చారిత్రక నేపథ్యం వుంది. భారతదేశంలో మాత్రం ఈ మతపరమైన తీవ్రవాదానికి బీజం వేసింది పాకిస్తాన్ పాలకులు, సైన్యాధిపతులు మాత్రమే. దాదాపు వెయ్యి సంవత్సరాలకు పైనుంచి భారతదేశంలో హిందు, ముస్లింలు సహజీవనం చేస్తున్నారు. ఈ యుగంలో అధిక భాగం మన దేశాన్ని ముస్లిం రాజులే పాలించారు. కానీ ఏ నాడు కూడా మన సమాజంలో మత విద్వేషాలు లేవు. కానీ స్వాతంత్ర్యం సమయంలో జరిగిన మతపరమైన దేశ విభజన ఈ విష నాగులకు ప్రాణం పోసింది. కాశ్మీర్‌ను భారత్‌లో అంతర్భాగం చేయడంపై పాకిస్తాన్ పాలకులు వ్యక్తం చేసిన అభ్యంతరాలు చిలికి చిలికి గాలివానగా మారి, మన దేశాన్ని ఇస్లామిక్ తీవ్రవాద స్థావరంగా మార్చి వేస్తున్నది.

### లాడెన్ బహిరంగ లేఖ

అమెరికా, ఐరోపా దేశాలపై ఇస్లామిక్ తీవ్రవాదుల జీహాద్ పోరాటానికి మత ప్రాతిపదిక తప్ప రాజకీయ కారణాలు లేవు. పాశ్చాత్య సమాజంలో పెచ్చరిల్లుతున్న పెడధోరణులను నిర్మూలించడానికి మాత్రమే వాటి మీద జీహాద్ జరపాలని ఒసామా బిన్ లాడెన్ పిలుపు ఇచ్చాడు. అమెరికాకు ఒసామా వ్రాసిన బహిరంగ లేఖలో తన సిద్ధాంతాన్ని స్పష్టంగా నిర్వచించాడు. "మీరు అధిక వడ్డీలకు అప్పులిస్తున్నారు. స్వలింగ సంపర్కాన్ని, మత్తు పదార్థాల వాడకాన్ని, జూదాన్ని ప్రోత్సహిస్తున్నారు. ఖాతాదారులను మచ్చిక చేసుకోవడానికి మహిళలను ఆటబొమ్మల వలె వాడుతున్నారు. దానికి స్త్రీ స్వేచ్ఛ అనే అందమైన పేరు పెడుతున్నారు. మీ సమాజం అన్నిరకాల అనైతిక కార్యకలాపాలను అనుమతిస్తున్నది. వ్యాపారం కోసం మీరు ఏమైనా చేస్తారు. ఈ ధోరణిని ఏ మాత్రం కూడా అంగీకరించం. ఆ తప్పుడు వైఖరులను నిర్మూలించడం కోసమే మీ దేశం మీద మేము జీహాద్ (ధర్మ యుద్ధం) ప్రకటిస్తున్నాము" అని ప్రకటించాడు ఒసామా బిన్ లాడెన్.



హైదరాబాద్‌లోని దిల్‌సుఖ్‌నగర్‌లో జరిగిన బాంబు పేలుళ్ల సంఘటనా స్థలంలో పోలీసుల పరిశీలన.



2008లో ముంబాయిలో జరిగిన బాంబు పేలుళ్ల ఘటనలో ధ్వంసమైన వాహనాలు.

### అమెరికా ద్వేషమెందుకు?

అయితే ఆ తర్వాత ఒసామా మీద కోపంతో ఆఫ్గనిస్తాన్‌పై అమెరికా జరిపిన దాడులు, ఇరాన్ ఇరాక్‌లలో చేసిన అకృత్యాలు యావత్ ఇస్లామిక్ సమాజంలోనే అమెరికా అంటే ద్వేషం పుట్టే పరిస్థితి కల్పించాయి. పెట్రోల్ నిల్వల మీద గుత్తాధిపత్యం కోసం అమెరికా చేసిన దురాగతానికి యావత్ ప్రపంచం ఇప్పుడు తీవ్రవాదం రూపంలో భారీ పరిహారం చెల్లిస్తున్నది.

భారతదేశం పరిస్థితి వేరు. మన సమాజం మీద ముస్లిం మేధావులకు, తీవ్రవాద సంస్థలకు పెద్దగా అభ్యంతరాలు లేవు. కానీ అమెరికాకు హెచ్చరిక చేయడానికి, ఆ అగ్ర రాజ్యంపై కక్ష తీర్చుకోవడానికి భారతదేశం మీద తరచు దాడులు జరుపుతున్నారు వారు. కాశ్మీర్ సమస్య ఇందుకొక కుంటిసాకు మాత్రమే. అమెరికా మీద దాడి చేయడం చాలా కష్టం. భారతదేశం మీద దాడి చేయడం చాలా సులభం. ఆ తేడా వల్లనే మనం తరచూ తీవ్రవాదుల అకృత్యాలకు బలైపోతున్నాము. అమెరికాతో మన ప్రభుత్వాల సహచర్యం వల్ల కలుగుతున్న అనర్థం ఇది. మన్మోహన్ సింగ్ ప్రధాని అయిన నాటి నుంచి మన విదేశాంగ విధానంలో పెను మార్పులు వచ్చాయి. దౌత్యనీతికి కూడా ఆర్థిక లక్ష్యాలను నిర్దేశించుకొన్నాడు మన్మోహన్‌సింగ్. ఇందిరమ్మ కానీ, నెహ్రూ కానీ పాలస్తీనా పోరాటానికి సంపూర్ణ మద్దతు ప్రకటించి, ముస్లిం సమాజం సానుభూతిని పొందేవారు. కానీ మన్మోహన్‌సింగ్ ఇజ్రాయిల్‌తో చేతులు కలిపాడు. ఒసామా మీద, ఆఫ్గనిస్తాన్ మీద జరిగిన దాడులలో అమెరికాకు పరోక్ష సహకారం అందించాడు. సద్దాం హుస్సేన్ మీద కక్షతో అమెరికా పాలకులు లక్షలాది మంది ఇరాక్ పసి పిల్లల ప్రాణాలు తీస్తున్నా మౌనం వహించాడు. ఇరాన్ మీద వారు చేస్తున్న ఒత్తిడికి కనీసపాటి అభ్యంతరం కూడా చెప్పడం లేదు. ఈ దౌత్య నీతి మార్పుల వల్ల అంతర్జాతీయ ముస్లిం సమాజంలో భారతదేశం పట్ల అదివరకున్న సానుభూతి గౌరవాలు మాయమైపోయాయి. అమెరికాతో సమానంగా మనల్ని కూడా శత్రువులుగా పరిగణించే దురదృష్టకర పరిస్థితులు నెలకొన్నాయి. దాని ఫలితాన్ని ప్రజలు అనుభవిస్తున్నారు.

### ముస్లిం దేశం కాని భారత్!

మహమ్మదీయులు పాలకులుగా వ్యవహరించిన ప్రతి దేశంలో స్థానిక మతాలు, ఆచారాలు అదృశ్యమై పూర్తి స్థాయి ముస్లిం దేశాలుగా అవతరించాయి. ఆసియా, ఆఫ్రికా ఖండంలో

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com